# ధర్మాగ్రహము

కళాప్రపూర్ణ
డాక్టర్ యస్.టి.
జ్ఞానానందకవి

# ధర్మాగ్రహము

కళాప్రపూర్ణ

**డా॥ యస్. టి. జ్ఞానానందకవి డి.లిట్**

ప్రథమ ముద్రణము అక్టోబరు–1998

మూల్యము : ముప్పదిరూపాయలు

ప్రతులు : అయిదువందలు

ముఖచిత్రణ : శ్రీ శీలా వీర్రాజు

ప్రతులకు :

డా॥ ఎస్. శరజ్జ్యోత్స్నారాణి
ఎం.ఏ, ఎం.ఫిల్, పి.హెచ్.డి.
ఇం.నెం. 1-9-286/2/4/సి/ఎ,
ఫ్లాట్ నం. 101, శ్రీసాయికృప అపార్టుమెంట్,
రాంనగర్ బ్రిడ్జి, విద్యానగర్,
హైదరాబాదు-500 044.

కళాప్రపూర్ణ
డా॥ యస్. టి. జ్ఞానానందకవి డి.లిట్
రసజ్ఞ నిలయం, దంతులూరివారి వీథి,
పేర్రాజుపేట, కాకినాడ–533 003,
తూర్పుగోదావరి జిల్లా.

ముద్రణ :
శివాజీ ప్రెస్, 4-4-63, [illegible] బజార్, సికింద్రాబాద్-500 003.

# సమర్పణము

"కరుణ గలుగునయ్య సురగాలి ఎల్లయ్య
అమ్మ పాపమాంబ లాశిషములె
ఇంతకవినిజేసె నీ కృతివారల
యడుగు దమ్ములకు సమర్పణమ్ము"

ఓం

# ధర్మాగ్రహం

## స్పందన

"స్ఫూర్తిశ్రీ"

కాకినాడలో గానీ, ఆ చుట్టుపక్కల యెక్కడయినా గానీ "కవిగారు" అని అంటే జ్ఞానానందకవిగారనే అర్థం. ఇంకా ఎందరో కవులున్నారు. అయినా ఆ రూఢిమాత్రం జ్ఞానానందకవి గారికే దక్కింది. రోడ్డుమీద సాధారణంగా ఆయన నడిచివెళ్లరు. ఎప్పుడూ సైకిల్ రిక్షామీద ఆరూఢులై వెడుతుంటారు. అప్పుడు కూడా ఆ కూర్చుండే ఠీవి చూచి తీరవలసిందే. హైస్కూలు పిల్లల దగ్గరనుంచి సాహిత్యాభిమానంగల స్త్రీలవరకు అందునా పెద్ద ముత్తైదువలు విరగబడి చూస్తూ "కవిగారు కవిగారు" అని చేతులు జోడించి తమలో తాము చెప్పుకుంటూ ఉండడం నేను చాలాసార్లు చూశాను. నన్ను కూడా ఒకరిద్దరు పెద్ద వారు "కవిగారు ఊళ్ళోలేరా? రోజూ రెండువూటలా ఇటువెడుతుంటే చూసేవాళ్ళం రెండుమూడు రోజులనుంచి కనిపించడం లేదు, అని అడిగారు. సాహిత్యానికి ఈ మాటలు అవసరమా? కాదని తెలిసికూడా చెప్పకుండా ఉండలేక చెబుతున్నాను. కవిగారు తమ పరిసరాల్లో ఆ విధమైన ముద్రవేసుకున్నారు. రోజువారీ జీవితంతో సైతం ఆయన నిండైన కవి. వెనక్కి దువ్విన ఒత్తయిన శిరోజాలు, ఎంతో ముద్దుగా పెంచుకున్న పొడుగుపాటి మీసాలు, వాటిని స్పృశించడానికి దిగివస్తున్నట్టు అనిపించే చెంపలు, మోకాళ్ళు దిగజారి వ్రేలాడే ఖద్దరు లాల్చీ, కొన్ని సమయాల్లో సిల్కు లాల్చీ, అందంగా తీర్చి దిద్దినట్టు కట్టిన పంచె-వీటన్నింటికీ అందం తెచ్చే ధీరగంభీరమైన నడక ఇది నాకు చేతనైనంతలో శ్రీ జ్ఞానానందకవిగారి రూపం.

నేను తటస్థపడినప్పుడు ఆయన అలవాటుచొప్పున రిక్షా పిలుస్తారు. "నాలు గడుగులు వెళ్ళడానికి రిక్షాకావాలా? డబ్బు మరీ దుబారా చేస్తున్నారు. ఇలా అయితే నేను మీతోరాను. నాతోవన నేనుపోతాను" అని ఒక రకమయిన ఆగ్రహం

చూపించేవాడిని. ఆయన "అలాగే! నడిచే వెడదాం" అని పిలిచిన రిక్షాను పంపించేస్తూ రిక్షావాని చేతిలో అర్థరూపాయో, రూపాయో పెట్టేవారు. ఇదీ ఆయనతరహా. "అందరూ నడిచివెడితే ఆ బీదవాళ్ళకి బువ్వ దొరికేదెలా? వాళ్ళు ఒళ్ళొంచి కష్టపడుతున్నారు. ఏ అపమార్గాలలోనూ ప్రవేశించడం లేదు. అందుచేత మనలాంటి వాళ్ళం ఆదుకోవాలి" అని అన్నారు. సామ్యవాదంగురించి గంటలతరబడి ఉపన్యాసాలు దంచేవాళ్ళని చాలామందిని చూశాను. నిత్యజీవితంలో వాళ్ళు ఒక్క పైసా కూడా విదలించినట్టు చూడలేదు. మహానుభావులు కొందరు లేకపోరు. జ్ఞానానంద కవిగారి ఆ ఒక్కముక్క ఎన్నో సంపుటాల్ని నా ముందు తెరచిపెట్టింది. జ్ఞానానందకవిగారు "ఆపద్బాంధవుడు" అన్నార్తుల ఆకలితీర్చే అనాథరక్షకుడు" అని అనిపించారు.

కవిగారిని నేను కనీసం నలభై యేళ్ళనుంచి యెరుగుదును. సన్నిహితంగా కూడా యెరుగుదుమ. ఒక హైస్కూలులో సెకండరీ గ్రేడు తెలుగు టీచరుకు వచ్చే జీతమెంత? ఆయన జీవితవిధానం చూచినవాళ్ళకు ఆశ్చర్యం కలుగుతుంది. వెనక ఆస్తి ఉందేమో అనే అనుమానంకూడా కలుగుతుంది. కటిక నిరుపేదగా కడగండ్ల జీవితం ప్రారంభించారు కవిగారు. తనకొక స్థాయి కలుగుతుందనే ధైర్యం ఆయనకు నిండుగా ఉంది. అందువల్లనే తన నిత్యజీవితం లోనూ బీద తనం గోచరం కారాదని ఆయన నిశ్చయం. తొలిరోజుల్లో సన్మానాలు మాట అలా ఉంచి అప్పులిచ్చేవాళ్ళుకూడా కరువయ్యారు. ఎంతవడ్డీకయినా వెనకాడకుండా కాబూలీవాళ్ళ దగ్గర అప్పు తెచ్చుకొని తాననుకున్నరీతిలో బ్రదుకుదిద్దుకునేవారు. దైన్యమూ హైన్యమూ అనే మాటలు కూడా తన జీవితంలో పొడచూపరాదు. ఆ హుందాతనాన్ని ఆ విధంగానే నిలబెట్టుకున్నారు. తనకు సరస్వతీదేవి అనుగ్రహించిన వరం కవిత్వం, తన కవిత్వంలో కాబూలీవాళ్ళను దయార్ద్ర హృదయులని వర్ణించారు. 'అన్నా' అని సంబోధించారు. తీసుకున్నది అప్పే అయినా వడ్డీతో సహా చెల్లించవలసిందే. అయినప్పటికీ అవసరంలో ఆదుకున్నాడన్న కృతజ్ఞత ఆయన అంతరాత్మలో నిలిచిపోయింది.

కూలివానిగా జీవితంలో అడుగుపెట్టిన జ్ఞానానందకవిగారు కళాప్రపూర్ణ తరకు ఎదిగారు. దాదాపుగా ఇదే శీర్షికతో కవిగారి జీవితచరిత్రను సంక్షిప్తంగా రచించి ఎవరో ప్రకటించారు కూడా, కలం పట్టింది మొదలుకొని ఈనాటివరకు ఆయనచేస్తున్న సేద్యం తద్యం. రెండో మూడో వచన గ్రంథాలు. ఒకటో రెండో

గేయ సంపుటాలు లేకపోలేదు. అయినా ఆయన ప్రధాన వ్యవసాయం పద్య క్షేత్రంలోనే. ఫలసాయం సంతృప్తిగా లేదని తెలిసికూడా పట్టువీడని విక్ర మార్కునివలె అనవద్యపద్య విద్యకే అంకితమయ్యారు. నన్నయాది ప్రథమా నాద్యకవుల మార్గాన్ని స్వాయత్తం చేసుకున్నారు. భువనవిజయసభల్లో ఆయనను రామరాజభూషణకవిగా ఆహ్వానించేవారు. అయ్యలరాజు రామభద్రుడు, పింగళ సూరన మొదలయిన మహాకవుల స్థానంలో వారిని ఆహ్వానించేవారు. ధరించిన భూమిక యేదయినా దానికి నూటికి నూరుపాళ్ళు ధర్మం చేసేవారు. వేదికమీద నుంచుని భుజంమీదనుంచి శాలువా వ్రేలాడుతుండగా సింహాసనాసీనుడైన శ్రీకృష్ణరాయలవంక గౌరవప్రత్యయాలు పెనవేసుకున్న వాలుచూపు వీలుగా చూస్తూ ఒక చేతిని పైకెత్తి గొంతెత్తి పద్యం చదువుతుంటే సభాస్తారులు "ఆ కవియే అవతరించాడా? అన్నంతగా విస్తుపోయేవారు" కవుల కథలకు రాజుల కథలులొచ్చు" అని అన్నారు తిరుపతి వేంకటకవులు. రాజ సమక్షంలో కూడా ఆత్మప్రత్యయం వీడని బింకమూ పొంకమూ తగిన రీతిలో అభినయించి ఔనని పించుకున్న సమర్థులు శ్రీ జ్ఞానానందకవిగారు.

ఈ విధంగా చెబుతూపోతే, యిదే ఒక గ్రంథమవుతుందేమో అన్నభయం కూడా ఉంది. అందుచేత నన్ను నేను నిగ్రహించుకొని ప్రస్తుతానికి రావడానికి ప్రయత్నిస్తాను.

మనచేతిలో ఉన్న గ్రంథంపేరు ధర్మాగ్రహం. ఇది కవిగారి ముద్రిత గ్రంథాలలో చివరిది. అచ్చుకానివీ తయారౌతూ ఉన్నవీ ఇంకా ఉన్నాయి. వారి కవితా భాగీరథి నిర్విరామంగా పొంగులెత్తి స్వర్ణాంధ్రను సస్యశ్యామలం చెయ్యా లని ఆశిద్దాం. ఆకాశమంత యెత్తున్నవానిని ఆశీర్వదిద్దామని చెప్పే చొరవ నాకు లేదు. అయినా మన హృదయాలు ఏకీభవిస్తే దేవతలు తప్పక 'తథాస్తు' పలుకు తారు.

ఈ గ్రంథంలో మొత్తం 24 ఖండికలున్నాయి. వీటిలో ఒకటి ధర్మా గ్రహం. అయితే మొత్తం పుస్తకానికి ఆ పేరే పెట్టడంలో ఔచిత్యం లేకపోలేదు అంతేకాదు. జ్ఞానానందకవిగారికి తాము వ్రాస్తున్న కవితలు ఏ లక్ష్యంతో వ్రాస్తు న్నారో దాన్ని గుర్తింపుచుకునే జ్ఞానముంది. దానితో ఆనందం పొందుతూ, పాఠకు లకు ఆనందం అందించే వితరణగుణం కూడా ఉంది. ఆ విధంగా ఆయన తన

పేరును తాము సార్థకం చేసుకుంటున్నారు. కొందరు కవులు భావప్రవాహంలో కొట్టుకుపోతుంటారు. లక్ష్యం విడిచి యెక్కడెక్కడికో కొట్టుకుపోతుంటారు. ఈ ధర్మాగ్రహ కవిగారు అటువంటి పొరపాటుచేయలేదు. అసలు కవిగానీ వక్తగానీ తాను కొట్టుకుపోవడం కాదు. తనతో పాఠకుల్నీ శ్రోతల్నీ తీసుకువెళ్ళాలి. ఆ రకమైన పారవశ్యం కలిగించాలి. అదే సద్యః పరనిర్వృతి అన్నారు పెద్దలు.

ఇంతకు ధర్మాగ్రహం అన్న పేరు చూడడంతోనే జాతిపిత గాంధీజీ మనకు ధారాదత్తం చేసిన అహింసాయుధం, అపూర్వాయుధం సత్యాగ్రహం గుర్తుకువచ్చింది. అయితే ఆ కాలంలో కొందరు విరుద్ధార్థాలు తీసినవాళ్ళు లేక పోలేదు. సతియొక్క ఆగ్రహమే సత్యాగ్రహమని అర్థంచెప్పి "చూడండి! మన యిళ్ళల్లో ఆడవాళ్ళకు కోపం వచ్చిందనుకోండి. ఆ పూట భోజనం మానేస్తారు. ఇదీ అలాంటిదే అని భాష్యం కూడా చెప్పిన ప్రబుద్ధులు లేకపోలేదు. దాని నలా ఉంచండి. ఆనాటి సత్యాగ్రహం తన లక్ష్యాన్ని తాను విజయవంతంగా సాధించిం దనడానికి చరిత్ర సాక్ష్యం. ఇంతకూ "ఆగ్రహం" అంటే కోపమని ఆంధ్రులకు చప్పున స్ఫురించే అర్థం. సంస్కృతం లోనూ ఈ అర్థం లేకపోలేదు. కాని ప్రసిద్ధమైన అర్థం "పట్టుదల' అని ఇదే అర్థంతో ఉత్తర హిందూస్థాన భాషలు దీనిని వాడుతున్నాయి. ఏతావతా 'సత్యం కోసం పట్టిన పట్టు' సత్యాగ్రహం అంటే సత్యదీక్ష అనే తాత్పర్యం. అదే విధంగా మనకవిగారు ధర్మదీక్ష అన్న అర్థంలో ధర్మాగ్రహం వాడారు. ధర్మాన్ని నిలబెట్టవలసి వచ్చినప్పుడు కోపం తెచ్చుకోవడం మహాపురుషుల లక్షణం. సామాన్యమానవులకయితే కోపం అయిన దానికీ, కానిదానికీ, అదే వస్తుంది. ఆ రకంగా ఆవిష్టులైనాడు ఊగిసలాడిపోతారు ఎన్ని అకార్యాలయినా చేస్తారు. మాన్యులు అవసరాన్ని బట్టి శస్త్రం కోపం కూడా సంధింపుతారు. అంటే ఆగ్రహం వారి వశంలో ఉంటుంది కాని దానివశంలోకి వారు పోరని అర్థం. ఇంతకూ ధర్మదీక్షయొక్క ఆవశ్యకతను గుర్తించిన జ్ఞానానందులు తమ పాఠకులకు దానిని ఉపదేశిస్తున్నారు. కేవలం పొడిమాటలతో కాకుండా ఒక గతిపీ సంగతినీ గల ఛందోరీతిలో తమ ఉపదేశం కొనసాగిస్తున్నారు. ఇది కేవలం ఒక ఖండికలో మాత్రమే కాకుండా ఈ సంపుటి లోని అన్ని ఖండికలలోనూ సాక్షాత్కరిస్తున్నది.

"ధారణాత్ ధర్మః" అనీ 'ధార్యతే అనేన ఇతి ధర్మః' అనీ పెద్దలు

ధర్మశబ్దాన్ని నిర్వచించారు. మనం దేనినయితే ధరిస్తున్నామో అది ధర్మమని ఒక నిర్వచనం కాగా, మనల్ని ధరించి నిలబెట్టేది ధర్మమని ఇంకొక నిర్వచనం "ధర్మో రక్షతి రక్షితః" అన్నసూక్తిలో పై రెండర్థాలూ పెనవేసుకుపోయాయి. ధర్మాన్ని మనం రక్షించినట్లయితే అది మనల్ని రక్షిస్తుంది. ఇంతకన్నా లోతుకు పోయి విమర్శించడానికి ఇది సమయమూ కాదు, సందర్భమూ కాదు. ఒక్క మాట చెప్పుకుందాము. "ధర్మం కొంచెమయినా నిలచిఉంది కాబట్టే ప్రపంచం ఇంత మాత్రంగా అయినా ఉంది" అని పామరజనులు కూడా చెప్పుకునే మాట! అనుభవం కాచివడబోసిన అమృతసారం.

ఇక్కడ కవిబ్రహ్మ తిక్కన హృదయం గుర్తించుకుందాం.

"సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత బొంకుచే
పారము పొందలేక చెడబారిన దైనయవస్థ దక్షులె
వ్వార లుపేక్షచేసి రది వారల చేటగు గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయకమయ్యును దైవముండెడిన్"

ధర్మద్రోహం జరిగినప్పుడు దక్షులుపేక్ష చెయ్యరాదట! ఉపేక్షచేస్తే అది వారిచేటుకే కాని సత్యధర్మాలకు నష్టం లేదట! వాటిని కలుగచేస్తూ దైవముంటాడట! అందుచేతనే సమర్థులైనవారు అసమర్థులవలె చూస్తూ ఊరుకోరాదు. షెల్లీ భాషలో కవి Unrecognied legislator of the world కవి ఎన్నికల్లో గెలుపొందిన శాసనసభ్యుడు కాని రాజ్య సభాసభ్యుడు కానికాడు. ఆ విధమైన గుర్తింపు అతనికి అక్కరలేదు. అతడు ధర్మసభా సభ్యుడు సత్యసభాసభ్యుడు, అందువల్లనే అతనికి శాసించే హక్కు అధికారమూ ఉన్నాయి. వేదం కూడా కవిం—అనుశాసితారం అని వర్ణిస్తూ ఉంది. దీనిని బట్టి కవి శాసకుడన్నది వేదసమ్మతమైన వాక్యం. అందువల్లనే శ్రీ జ్ఞానానందకవి ధర్మదీక్ష వహించి పాఠకులకు ధర్మదీక్ష యిస్తున్నారు. ఈ దీక్షకు మంత్ర తంత్రాలతో పనిలేదు. కవి నిజమైన కవి అయినప్పుడు వాక్శుద్ధి కలిగిన కవి అయినప్పుడు అతనిమాట మంత్రమై మోగుతుంది. కవిది పట్టు కలిగినవాక్కు, పట్టుదల కలిగినవాక్కులు ఎంత దుర్లభమైన వస్తువు నయినా సులభంగా పట్టగలిగినవాక్కు.

జ్ఞానానందకవిగారు ఎన్నుకొన్న మార్గం కూడా ఇదే. తన సోదరప్రజాపి

కానికి వెన్ను చరిచినా, విన్నవించినా ఆయన సాధనం పద్యం, హృద్యం నిర వద్యం.

## 3

ధర్మాగ్రహం సంపుటిలో 1945 నుంచి 1998 వరకు ఉన్న రచనలున్నాయి. ఈ మధ్యకాలంలో కవిగారురచించిన గ్రంథాలు దరిదాపు 40ఉంటాయి. వారి శైలిని గుర్తించాలనీ వారి కవితా వికాసాన్ని గుర్తించాలనీ ఉబలాటపడే పరిశీలకులకూ జిజ్ఞాసువులకూ దీనిని సారసంపుటిగా అందిస్తున్నారు మొదటి ఖండిక 1945 నాటిది. తమ మాతృమూర్తికి అంజలి సమర్పిస్తున్నారు. అమ్మ అనే మాటలోనే అమృతముంది. అక్షరాలలో మొట్టమొదటిది 'అ' కంఠంలో పుడుతుంది. 'మ' స్పర్శములలో చివరిది రెండు పెదవులనూ కలిపి తాళం బిగించినప్పుడు పుడుతుంది. అందులోనూ ద్విత్వం. పెదవులు బిగించి ఉండడం వల్ల ప్రకంపనాల ధ్వని చెవులలో తుమ్మెద మ్రోతవంటి మ్రోతను వినిపిస్తుంది. అటువంటి మాధుర్యం మాటలో కూడా పొందుపరచుకుంది అమ్మ. సంస్కృతంలో 'ఓం' ఎటువంటిదో తెలుగులో అమ్మ అటువంటిది.

"ఏ జన్మంబున నోము నోచుకొని తల్లీ! కంటివో నన్ను నీ
పూజాభాజనమైన గర్భమున దీప్తుల్ సిమ్మ సాహిత్యపున్
తేజంబిందు రహింపగా తేలిసిలే నీ స్వాంతంపుటార్ద్రిత్వముల్
నా జన్మంబు ఫలించె వ్రాసెద నగణ్యం బైన సాహిత్యమున్"

తనవంటి కొడుకు పూజాఫలంగా లభించవలసినవాడే అయితే తనలో ఉబికిన సాహిత్యతేజం అమ్మమనస్సులోని ఆర్ద్రిత్వమే అంటున్నాడు. తల్లిపట్ల భక్తి, తనపట్ల విశ్వాసమూ ఎంతగా ఉన్నాయో గుర్తించండి.

"ఆ నాకంబున నీవు వర్తిలుచు విద్యాప్రౌఢ పారంగత
జ్ఞానుల్ దివ్యసభాంతరాళమున విన్నాణంబు చెన్నార నీ
జ్ఞానానందకుమారరత్నము పఠించన్ సత్కవిత్వంబు నీ
వానందంబున దేలవా? యదియు నాకనందముం గూర్పదా?"

చిన్నతనంలోనే తల్లి చనిపోయింది. 'నువ్వు ఎక్కడున్నావో? అని ప్రశ్న

వెయ్యరం లేదు మన కవిగారు. ఆమె స్వర్గంలోనే ఉందన్నది గాఢ నిశ్చయం. అక్కడనుంచి చూచిన తల్లి తన అభ్యుదయానికి సంతోషిస్తుందట. ఆమె సంతోషమే తన సంతోషమట. వాత్సల్యమే అతికోమలమైన రసం. దానిని కవిగారు నిర్వహించిన తీరు మరీ సుతారంగా ఉంది. మొదటి పద్యంలో మొదటిపాదంలో 'తల్లీ' అని యతిస్థానంలో సంబోధన వచ్చింది. ఇచ్చటి "ఈ" దీర్ఘం కన్నా దీర్ఘంగా ఉంటుంది. దీనిని ప్లుతం అంటారు. కవిగారు చదువుతుంటే ఎదురుగా తల్లి ఉన్నట్టూ ఆయన పిలుస్తున్నట్టూ అనిపిస్తుంది. ఇది పద్యశిల్పంలో ఒక రహస్యం. రెండవ పద్యంలో మూడవ పంక్తి "వశించన్" అన్నచోట యతిమీద విరుగుతుంది. ఇది నిజమైన విరతి. "విన్నాణంబు చెన్నార" అన్న రెండవపంక్తి లోని అనుప్రాస శ్రవణపేయంగా ఉంది.

కవిగారు అయ్యదేవర కాళేశ్వరరావుగారి గురించి ఒక కావ్యమే వ్రాశారు. కాళేశ్వరరావుగారు చనిపోయినప్పుడు నాలుగుపద్యాలు వ్రాశారు. ఆ నాలుగూ ఆణిముత్యాలే మొదటి పద్యం చూద్దాం –

"ఒక మహాజ్యోతి భూమికి నొరగునట్లు
నేలపయి నొండు పండాకు రాలినట్లు
తెనుగు భువనమ్ము గగనాన నెనుబదేండ్ల
వృద్ధయోధుండ రాలిపోయితివి నేడు."

మనస్సుకు సూటిగా తగిలే భావం. మొదటి రెండుపాదాలలోని ఉపమాసామర్థ్యం అనుపమానం. 'రాలిపోయితివి' తెలుగు జాతీయం మొత్తం పద్యంలోని నడక భావానికి అనుగుణంగా పట్టుగా సరళంగా ఉంది. "పండుటాకు అని" అనకుండా "పండాకు" అని అనడంలో కవిగారు ఒక ప్రయోజనం సాధించారు.

"మతము" అనే శీర్షికతో ఒకే పద్యం వ్రాశారు. "నిక్కమైన మంచినీల మొక్కటిచాలు. తళుకు బెళుకు రాలుతట్టెడేల?" అన్న వేమన్న హృదయం ప్రతిఫలిస్తున్న దీపద్యంలో–

"హితము నెరపనట్టి మతమన్న నదియేల?
శాంతి నిడని సాధుసంఘమేల?"

అని ప్రశ్నిస్తున్నారు. హితం కలిగిస్తే మతమూ, శాంతినిస్తే సాధు సంఘమూ ఉపాదేయములే అన్నది వీరిఆశయం. మతం కావాలి మానవతను పడగొట్టడానికి కాక నిలబెట్టడానికి కావాలి. అటుకాని దాన్ని పూడ్చిపెట్టవలసిందే అని కవిగారి నిర్ణయం.

"కవిత పూర్వజన్మ గంధమ్ము వల్లనే
కలుగు గాని చదువువలన గాదు"

శిరోధార్యమైన సత్యసూక్తి.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ఆంధ్ర పురాణ మహాకవి. రెండే పద్యాలు వ్రాశారు కవిగారు వారిని గురించి "ఈ మధురములగు శబ్దమ్ముల అని మొదలుపెట్టి.

"మధునాపంతుల కవీంద్ర మాన్యాంజలు లౌ"

అని మొదటి పద్యం ముగించారు. "ధ ధ" లను ప్రాసలో మైత్రి కలిపివాడవచ్చు నన్న విషయానికి ఇది విశద నిదర్శనం. కవిగారి ఛందోమార్మికతకు నిశిత దృష్టికి తార్కాణం.

"ఏరీ నీవలె తెల్గులో రచనలన్ హృద్యానవద్యమ్ముగా
స్వారస్యమ్ములు పండినట్లు రచియింపన్ శాస్త్రివర్యా! కనన్
లేరంచున్ బలుకన్ యథార్థమిదిలే నీ దైన మంటాన జా
ల్వారున్ పొంగులువార సత్కవన ధారా నిర్ఝరీ ధోరణుల్"

ఈ పద్యం వినీ వినడంతోనే ఆనాడు శ్రీనాథుడు "ఈ క్షితిన్ నినుబోలు సత్కవులు లేరీ నాటి కాలంబునన్" అని మొదలుపెట్టి వ్రాసిన పద్యం గుర్తుకు వస్తుంది. ఈ అభినవ శ్రీనాథుడు ఆ శ్రీనాథునితో సమవుజ్జీగా సవాలుచేసి ఈ పద్యం వ్రాసినట్టు తోస్తుంది. అయితే శ్రీనాథుడు తన్ను గురించి తానే వ్రాసుకున్నాడు. అభినవ శ్రీనాథుడు సమకాలికుడైన ఆంధ్ర కల్హణుని గురించి వ్రాశాడు.

"స్వర్ణోత్సవవేళలో" అన్న శీర్షికతో బంగారం వంటి సీస పద్యాన్ని రచించారు.

"కనిపింపరాదిట తిన తిండి లేనట్టి
నిరుపేదవాని కన్నీటిబొట్టు
వినిపింపరాదిట విశ్వమ్ము గర్హించు
కుటిలచిత్తుని దగాకోరు పలుకు
ధ్వనియింపరాదిట స్వార్థమాశించిన
స్తోత్ర పాఠకుని యపాత్ర గీతి
తనియింపరాదిట ధర్మమ్ము నెదిరించు
కపటభక్తుని క్షుదాగర్భితలము

కదలుచున్న ప్రగతి కళ్యాణదేవత
నవ్యభారతమున నాట్యమాడి
జరుగు నేటిదేండ్ల స్వర్ణోత్సవాలకు
నుజ్జ్వలంపు టూతమొసగుగాక!"

కవిగారి ఆశలకూ, ఆశయాలకూ అద్దం పడుతున్న పద్యం. కొండ 'అద్దమందు కొంచెమై యుండదా? అన్నాడు వేమన్న కొంచెమే అయినా స్వరూపజ్ఞానానికి సహకరిస్తున్నది. నా ఉబలాట మాపుకోలేక నేను వివరించదమే కాని ప్రతి పద్యమూ కవిగారిచేతిలో మైనపుముద్దవలె ఒద్దికలు దిద్దుకొని అంతరంగాన్ని ఆవిష్కరిస్తూనే ఉంటుంది. రచనాశిల్పం గురించి ఒక్కమాట! శ్రీనాథునికి సీస మంటే యిష్టమని పెద్దలు చాలామంది వక్కాణించారు. మన అభినవ శ్రీనాథునికీ అంతే సీసపద్యంలో జ్ఞానానందకవిగారు ఎన్నెన్నో గతివిన్యాసాలు చూపించారు. నాట్యభంగిమలు ప్రదర్శించారు. కదను తొక్కించారు. ఈ పద్యంలో సీసపాదాలు ప్రాససౌందర్యాన్ని సంతరించుకున్నాయి. కనిపింపరాదిట- వినిపింపరాదిట- ధ్వనియింపరాదిట- తనియింపరాదిట ఈ మాటల్ని చూచి యింకా కొన్ని మాటల్ని ఈ విధంగానే పలికి అవహేళనచేసేవారిని నేనెరుగుదును. ఈ విధమైన నియమంతో, సమత చెడకుండా, క్రమత విడకుండా నిర్వహించడం దుర్వహం. ఒకటి రెండు పద్యాలు మాత్రమే కాదు. ఎన్నో ఎన్నెన్నో సీసపద్యాలు కవిగారిచేతిలో కళా సంపదను సంపాదించుకున్నాయి. ఆయనకు ఏపం విధ రచన నల్లేరుపై బండి నడక.

## 4

అనేక పర్వదినాలమీద జాతీయపర్వదినాలమీద కవిగారు ఎన్నో కవితలు వ్రాశారు. ఆకాశవాణి కార్యక్రమాల్లో సాహిత్య సభల్లో ఎన్నో కవితాఖండాల్ని శమదైన బాణిలో వినిపించారు. కవిగారి అంతర్వేదనకూ, సామాజిక స్పృహకూ అవన్నీ నిలువుటద్దాలవంటివే. గోప్యమూ జాప్యమూ లేకుండా తమ నిశ్చిత భావాల్ని స్తవనీయమైన కవిత్వసరణిలో ఆయన వ్యక్తం చేశారు. మనగ్రంథంలో భాత–బంగారుభూమి– తెనుగుతల్లి–యువ. భావ-ఆకాంక్ష–బహుధాన్య– ఈశ్వరా ధర్మాగ్రహము మొదలయిన రచనలన్నీ సమాజదర్శనంతో స్పందించిన కవిగారి ఆర్ద్రహృదయం అందించే సందేశమే. ఈ సందేశం కొన్నిచోట్ల జాలిగా, కొన్ని చోట్ల చురుకుగా, కొన్నిచోట్ల సంవేదనంలా, కొన్నిచోట్ల శాసనంలా ఇంకా ఎన్నో విధాలుగా ఉండవచ్చు. ఆవేదనలో చాలాభాగం, ఆవేశంలో చాలాభాగం తనకోసం కాదు, తన జాతికోసమే. స్వార్థంకన్నా పరార్థమే వీరికి పరమార్థం.

"చదువులేనివారు సంఘాలు పెట్టిన
అవసరమ్ము వారి కాశ్రయమ్ము
చదువుకొన్నవాండ్రు సంఘాలు పెట్టిన
నంగనాచితనము తొంగిచూచు"

ఈనాడు న్యాయబలమూ, ధర్మబలమూ కాక మందిబలమే అందలమెక్కుతుంది. విద్యావంతులు కూడ అదేమార్గాన్ని అనుసరించడం కవిగారికి అనుచితమని అని పిస్తున్నది. దానికి మందలింపే వైపద్యం.

వర్ణరహిత సమాజం, వర్గరహిత సమాజం, మతరహిత సమాజం, లౌకిక రాజ్యం, ప్రజాస్వామ్యం, ప్రజాసామ్యం – మొదలయిన మాటలు ఈనాడు నిత్య మాటలుగా వినవస్తున్నాయి. దాదాపు వైవన్నీ బూటకపుమాటలే, బాటవేరు, మాట వేరు, వాటిలో ఒక విషయాన్ని కవిగారు కుండబద్దలుగొట్టి బయటపెడు తున్నారు.

"కులముల్ లేవని గొంతు చించుకొని పల్కుల్ పల్కు సోదర్యులా
కులపుం బేరున గొప్ప గొప్ప పదవుల్ గుర్తింపులుంబొంది యా

కులమున్ బెంచెద రట్టివారలు దగాకోరుల్ ప్రజాస్వామ్యమం
దలరన్ హైందవజాతి సంస్కృతి ప్రతిధ్వస్తంబు గాకుండునే ?"

ప్రజా హృదయాన్ని కవిగారు తనవాణితో ఈ విధంగా వినిపిస్తున్నారు. ఈ ప్రశ్నలు ఒక్క కవిగారివేకాదు. ప్రతిపౌరుని గుండెలోనూ ఆరని చితిని రగుల్కొల్పుతున్న ప్రశ్నలివి—

"ఎవడాపగలడురా ? యీ మహాదారుణ
మారణకాండ దుర్మార్గ చరిత
ఎవడాపగలడురా ? యీ నిత్య మానభం
గాల దౌర్భాగ్య సంస్కార వికృతి
ఎవడాపగలడురా ? యీ యసూయాద్వేష
దుష్టభావుకుల విద్రోహచింత
ఎవడాపగలడురా ? యీ భిన్నపార్టీల
కల్లోల తీవ్ర సంఘర్షణమ్ము
ఎవ్వడాపగలడు చివ్వకు కాల్దువ్వు
కులమతాల వృషభ కుంజరముల
తెలుగువారిలోన గల భిన్నభావాల
కూపిరీయవద్దు 'యువయుగాది' !

ఈ ముక్తాయింపుతో ముక్తకంఠంతో తమ ఆవేదననూ, ఆవేశాన్నీ ఆవిష్కరిస్తున్నారు కవిగారు. కావ్యం మీ చేతిలో ఉంది. ఆసక్తితో చదవండి. మన సమాజపు తీరుతెన్నులనూ, ప్రభుత్వాల తీరుతెన్నులనూ కవి యెంత నిశితంగా పరిశీలించారో గుర్తించండి. ఇదేబాటలో నడచిన యింకొక పద్యంకూడా చూడండి—

"రాజకీయాల నేరాలతో జీవించు
వంచకులాట్ట కట్టించునాడు
అనిశమ్ము స్వార్థమై యన్నృతాల వచియించు
హీనుల నోళ్ళు మూయించునాడు

కులమత ఛాందస క్రూర కర్మతుల దు
శ్చేష్టితాల సమాధి సేయునాడు
విత్తమ్ము నార్జింప పెద్ద త్రోవలను ద్రొక్కు
గూండాల శక్తుల చెండునాడు

ప్రజలలోన అనైక్యంపు భావజాల
ముడుగునాడు నీరాక మాకిడునుగాక
నిర్మలానంద జీవనోన్మేష గరిమ
'యువ' వినూతన వర్ష ప్రభూ! హసాదు!"

ఈ విధంగా నేటిస్థితిని గుర్తించి రావలసినమార్పును కవిగారు ఖండితంగా చెబుతున్నారు. దోషాలను ఎత్తిచూపడమేకాదు, గుణాలను ప్రస్తుతించడంకూడా కవిగారు ప్రశంసనీయంగా చేశారు. మొదట్లోనే తమ మాతృదేవికి అంజలి ఘటించారు. భారతీయుడుగా భారతదేశాన్ని ఆంధ్రుడుగా ఆంధ్రదేశాన్ని ప్రశంసించారు. చారిత్రక సత్యాల నెన్నింటినో రసరమణీయంగా కీర్తించారు. భూత భవిష్యద్వర్తమానాలను వంతెనవేసి శ్లాఘాపాత్రంగా ప్రవర్తించారు.

మా మిత్రులు నలాది ప్రభంజనస్వామిగారు సరస్వతీదేవి దర్శనం ఈ విధంగా చేశారు–

'అవ్యక్తానందదోగ్ధ్రీ రసరుచిరమనా స్నిగ్ధ శబ్దార్థరూపా
శశ్వద్ధర్మైకధాత్రీ ప్రణయహితకరీ లోకకల్యాణ శీలా ।
దుర్భావధ్వాంత చాంద్రీ ధ్వనిమధురధునీ సాధువృత్తాంత భూషా
వాగ్దేవీ సేవితవ్యా నియత మనుదినం సర్వకారుణ్యమూర్తిః ॥"

సరస్వతీదేవికి పదిలక్షణాలున్నాయి. ఈ దశలక్షణ లక్షితయైన శారదాదేవిని సహృదయులు నిత్యమూ సేవించాలి. అవ్యక్తమయిన ఆనందక్షీరాన్ని ప్రసాదించేది రసంతో ఉజ్జ్వలమయిన మనస్సుకలది, శబ్దార్థములే స్నిగ్ధమైన రూపంగా కలది. శాశ్వత ధర్మాన్ని ధరించిఉండేది. ప్రణయాన్నీ హితాన్నీ కలిగించేది, లోకానికి కల్యాణం చేకూర్చడమే స్వభావంగా కలది, దుర్భావములనే చీకట్లను చెదరగొట్టే వెన్నెలను కాసేది ధ్వని మధురమై ప్రవహించేది, సాధు

వృత్తాంతములనే అలంకారములను ధరించేది, కారుణ్యమూర్తి - యిది స్వామిగారి వర్ణన సారం. ఈ పది లక్షణాలు జ్ఞానానందకవిగారి "ధర్మాగ్రహం" కావ్య సంపుటిలో చక్కగా అమరిఉన్నాయి. అచ్చమైన, రుచిరమైన, రసానంద ప్రసాదిని అయిన వాగ్దేవిని జ్ఞానానందకవిగారు దర్శించి చిత్రించారు. మనల్ని సేవించి తరించమంటున్నారు. సహృదయ పాఠకులే ఆయా లక్షణాలకు లక్ష్యాల్ని అవగాహన చేసుకుని ఆనందిస్తారని నా ఆకాంక్ష.

కవిగారి ఆత్మీయత ప్రతి ఖండికలోనూ ప్రత్యక్షమవుతూనే ఉంది. కథా కావ్యాల్లో అయితే కవి తటస్థుడై ఉంటాడు. ఏ అర్థాంతర న్యాసంలోనో కొంచెం తొంగిచూస్తాడు. కాని యీ విధమైన ఖండకావ్యరచనలో ఆత్మాశ్రయత్వం అగ్రస్థానాన్ని పొందుతుంది సహజంగా 'నేను' అని మొదలుపెట్టకపోయినా ఆత్మానుభవమే ఆవిష్కృతమవుతుంది. మన కవిగారు దాపరికం లేకుండా 'నేను' అని మొదలుపెట్టి స్వీయ వృత్తాంతంకూడా విస్తారంగానే చెప్పారు. దానినీ గమనిద్దాం.

"ఆంధ్రమ్ము తెలగాణ యైకమత్యమునకు
తెలగాణ నేనురా తిరిగినాను
ప్రతిన బూనుచు తెల్గుభాషాభివృద్ధికి
గ్రంథాలు నేనురా వ్రాసినాను
జాతీయ సుకవితా సమ్మేళనములోన
ముదమార నేనురా చదివినాను
మానవత్వపు దివ్యమార్గమ్ము శాంతికి
నెలవని నేనురా తలచినాను

ప్రతిభకును చోటులేని యీ క్షితితలాన
కుల మహావ్యాధి గాంద్రించు కువలయాన
ఇల్లువాకిలి లేక నే యీ విధాన
పరమతృప్తిమై నేనురా బ్రతుకుచుంటి."

ప్రతి పాదంలోనూ "నేనురా" అనేమాటను ముక్తాయించడం జరిగింది. అది అసలే

లేకపోయినా "తిరిగినాను" మొదలయిన క్రియాపదాలవల్లనే అర్థం సుబోధమవుతుంది. అయినా కవి యెంత 'ధీమా'తో చెప్పారో దానిని గమనించడం అవసరం సీసపద్యంలో అన్నీ సమత కలిగిన పాదాలే. వాటికి అనురూపంగా ఎత్తుగీతిలో మొదటి మూడుపాదాలూ దీర్ఘపూర్వకమైన 'న'తో అంతమవుతున్నాయి. వెనక చెప్పిన సమత కడదాకా నిలబెట్టుకుంటూ బెట్టుగా పద్యం సాగిందనడానికి ఇదొక నిదర్శనం.

"పొగడె నా శారద జగజగ్గు దిలకించి
విశ్వైక కవినాథ విశ్వనాథ
అడిగె నా గ్రంథమ్ము నంకితమ్మొ అయ్య
దేవరాన్వయహేలి ధీవరుండు
కడిగె నా శిరమును కనకాభిషేకాన
కర్మవీరుడు బొజ్జ ధర్మరాజు
తొడిగె పెండెరము నా యెడమపాదానకు
రహిని జ్యోతుల సీతరామమూర్తి
ఎందరెందరో సాహిత్య సృష్టికర్త
లెలమి పొగడిరి నాదు కైతలనుగాంచి
శారదాదేవి ఘన కటాక్షమ్ము కలిగె
వసుధ నికపైని నేమికావలయు నాకు ?"

"తాంధ్రపాపయ్య సర్దారు ధైర్యశ్రీకి
ఆకరంబైన తాలూక నాది
కవితా విపంచికా గానమ్ము మ్రోగు
పేరొందు పెదవెంకి యూరునాది
గీర్వాణ భారతకృతి రచించిన మహా
కుశలుడౌ వ్యాసర్షి కులమునాది
మహిత లక్షణమైన మానవతా వాద
వాస నడచెడు త్రోవనాది

ఏనుకవి సార్వభౌముడ; ఏను విశ్వ
నాథ శిష్యుండ; సాహితీ నందనమున
బెడగు కబ్బంపు విరుల గల్పించినట్టి
భువనహితుడ; జ్ఞానానందకవిని నేను

ఆంధ్రకవి పండితలోకంలో ప్రసిద్ధులందరూ జ్ఞానానందకవిగారిని ఎరుగుదురు. విశ్వనాథవారు శిష్యవాత్సల్యంతో చూడగా, జాషువాగారు సోదరప్రేమ చూపించేవారు. పెక్కురు ప్రభుత్వాధికారులు, ప్రసిద్ధ ధనికులు జ్ఞానానందకవి కృతి భర్తలై ఆయనకు ఋణపడి ఉన్నారు. శ్రీ దామోదరం సంజీవయ్య, శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ మాల కొండయ్య, జస్టిస్ పున్నయ్య ప్రభృతులు వారిలో కొందరు. కవిగారిని ఒక విశ్వవిద్యాలయం 'కళా ప్రపూర్ణ'తో సత్కరించింది. డాక్టరేట్ తో మరొకటి డి.లిట్ తో సత్కరించాయి. కవిగారు ప్రభుత్వంవారి Language Committee లో రెండుసార్లు సభ్యులుగా ఉన్నారు. ఉన్నత విద్యాశాఖవారు ఉపవాచకాలు వ్రాయించుకున్నారు. గ్రాడ్యుయేటు విద్యార్థులకు వీరి ఆమ్రపాలి గోలకొండ మొదలయిన కావ్యాలు నవ్య కావ్యాలుగా పురస్కరింపబడ్డాయి. ఢిల్లీ సాహిత్య సమారోహలో తెలుగుకవిగా, జ్ఞానానందకవిగారు తమవాణిని వినిపించారు. సాహిత్య ఆకాదమీ పురస్కారం అందుకున్నారు. వివిధ సాహిత్య పురస్కారాలు వారిని వరించివచ్చాయి. కవి కోకిలనుండి కవి సార్వభౌమవరకు అనేక బిరుదులు అందుకున్నారు. శ్రీకొంపెల్ల వీరి పద్యాల్ని కొన్నింటిని ఎన్నికచేసి ఆంగ్లీకరించారు. సాహిత్యాభిమానులు కవిగారికి పెద్దయెత్తున కనకాభిషేకం చేశారు. బంగారు గండపెండారం వేశారు. ఇంకా ఎన్నెన్నో సాహిత్యగౌరవాలు పొందారు కవిగారు.

కవిగారు మాత్రం ఎవరి ఋణమూ తీర్చుకోకుండాలేరు. ప్రస్తుత సంపుటిలోని కృతజ్ఞతాంజలి, గండపెండేరము, ప్రత్యభినందన, గోపీనాథరెడ్డి, సుబ్బరామిరెడ్డి, మల్లెమాల, రసమయి మొదలయిన రచనలు అందుకు నిదర్శనాలు.

తెలుగు సాహిత్యమాగాణంలో అరవైయేండ్లకుపైగా వ్యవసాయం చేస్తున్న నిరంతర కృషీవలులైన జ్ఞానానందకవిగారి రచనలు వాసిగాంచినవి, రాశికెక్కినవి. క్రీస్తుప్రబంధము ద్వితీయ సంపుటి ముద్రితం కావలసిఉంది. వివేకానంద

కావ్యం తుదిమెరుగులు దిద్దుకుంటూ ఉంది. ఈ గ్రంథాలన్నీ "సంపూర్ణ గ్రంథా వళి" పేరున ఒకటి రెండు సంపుటాలుగా రావలసిన ఆవశ్యకత యెంతయినా ఉంది. వదాన్యులు వ్యక్తిగతంగానో, సంస్థాపరంగానో ముద్రణ కార్యక్రమానికి పూనుకోవాలి. జ్ఞానపీఠాసీనులై జ్ఞానానంద కవిగారు ఆ పురస్కారాన్ని అందు కొని ఆంధ్రభాషకూ సాహిత్యానికీ మరింత స్థాయిని పెంచగలరని నా ఆకాంక్ష.

"ఆంధ్రత్వ మాంధ్రభాషాచ నాల్పస్య తపసః ఫలమ్".

# సన్నుతి

"అయ్య! సురగాలి ఎల్లయ్య ఆశిషమ్ము
అమ్మ పాపమ్మ చేతి క్షీరాన్న ధార ;
మేనమామ శ్రీ గుంట యోహానుకరుణ
అండసాక్షి నా కవిత కాలంబనంబు.

# నా మాట

నిసర్గోజ్జ్వలభాసమాన హృదయులైన
సాహిత్య సగంధులకు

సాహిత్యం సత్య సౌందర్యాల ప్రగాఢ సమాశ్లేషం. సాహిత్యం హిత సంయుతం లోకహితం. సంతతగాఢ నిద్రాదరిద్రాణమైన లోకాన్ని మేలుకొలుపు చైతన్య భేరీభాంకృతం. జాతిజనుల గుండెల్లో మంత్రంగా సోదరులంతా పంచుకునే వెలుగురవ్వల జడిగా హృద్యంగా నైవేద్యంగా సామాజిక స్పృహ కలిగించే విధంగా సాహిత్య సృష్టి నిర్మింపబడాలి. సాహిత్యం నేలవిడిచిన సాముకాదు. అంధకారంలోనుంచి ప్రకాశంలోకి, మృత్యువునుంచి అమృతత్వంలోకి అసత్యంనుంచి సత్యంలోకి శోకంనుంచి ఆనందంలోకి నడిపించేదిగా సాహిత్యదీపం వెలగాలి. సాహిత్యం మాటలమూటకాదు. శబ్దాల గారడీకాదు. పరమపద సోపానం. తేనెసోన. శ్రాంత హృదయాలకు అశాంత చిత్తాలకు విశ్రాంతి ప్రాసాదం. సంసార విషవృక్షానికి అమృత ఫలప్రదానం. నేలకూ నీలాకాశానికి నడుమ రంగుల ధనుస్సు సాహిత్యం. సాహిత్యంగురించి యెంతైన చర్చ సేయవచ్చును. ఎంతో మంది సాహితీపరులు, విమర్శకులు సాహిత్యచర్చ సలుపుచునేయున్నారు. వారి చర్చలు ఆలోచనలు దేశసంస్కృతికి దారితీసినవిగా నున్నచో ఆనందింపదగ్గ విషయం ఆ విషమ సంస్కృతినుండి సమసంస్కృతికి అడుగువేయ గలగాలి. సంస్కృతి లేనిదే దేశానికి లేదు నిష్కృతి. నీతి నిజాయితీలే రచయితలకు కవులకు మూలద్రవ్యం. అట్టివారు వాల్టేరు, రూసో, మెజినీ, తమ రచనలద్వారా సమాజాన్ని మేల్కొల్పినట్లే మేల్కొల్పుదురు.

ఏ కళ అయినా సరే ఈ భూతల సంబంధం కలిగినప్పుడే అది ఉజ్జీవమవుతుంది గాక. ఈ భూతలాన్ని వదిల్లి విస్మరించిన కళ గడ్డిపరకలా బలహీనమవుతుంది. భావావేశంలో ఉన్న కవి స్వర్గంనుండి భూమిని భూమినుండి స్వర్గాన్ని వీక్షిస్తాడు. అతని ఊహాశక్తి అగోచరమైన విషయాలకు రూపం కల్పిస్తుంది. అతని కలం అప్రధాన్యంగా ఉన్నవాటికి ఒక గుర్తింపు నిచ్చే ఆకారాన్ని కల్గిస్తుంది.

ఇది నా మరియొక ఖండకావ్యం. ఇంతకుముందు పదునేడు ఖండకావ్యాలు రెండు శతకాలు, ఆరు చరిత్రకావ్యాలు, ఒకటి నాపై ప్రముఖులు వ్రాసిన ఆంగ్ల వ్యాసములచ్చయినవి. ఇంక తొమ్మిది గ్రంథములచ్చు కావలసియున్నవి. నేటికి తెలుగునేల నాలుగు చెఱగులనుండి నా రచనలు చదివి ఆనందించి అభినందిస్తూ లేఖలు వ్రాస్తున్న రసజ్ఞులకు అభినందనలు.

నా జీవన కవితా యాత్రాపథంలో ఉత్సాహాన్ని అందించిన భాషా బంధువు లనేకులున్నారు. ముఖ్యంగా మనిషికి, ఉద్యోగ జీవితానికి అభ్యుదయ కీర్తి గిరి శృంగంపై నిలబెట్టడానికి కారణభూతులైన వర్ణఖండన విదగ్ధులను జాతీయ నాయకావతంసులను అసాధారణ ప్రతిభా మనీషా సంపన్నులగు కవిగ్రామణు లను కొనియాడుట కృతజ్ఞతా భావనమని తలతును.

ఈ తరుణంలో

డాక్టరు అయ్యదేవర కాళేశ్వరరావుపంతులు
డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి
డాక్టరు నీలం సంజీవరెడ్డి
శ్రీ భవనం వేంకటరామరెడ్డి

కవి సమ్రాట్, పద్మభూషణులు, డాక్టరు విశ్వనాథ సత్యనారాయణ ఈ యుగ కవిలోక ప్రతినిధి, పద్మభూషణులూ రాజ్యసభ సభ్యులు డాక్టరు సింగిరెడ్డి నారాయణరెడ్డి ప్రభృతివరులను కొండాడుట అప్రస్తుతంకాదని యనుకొందును.

ఎంతో వ్రాయవలసియున్నది. నేడు తలెత్తి తిరుగుచున్న వాదాలు, వర్గాలు, వర్ణాలు, మతా లేమార్గంన త్రొక్కుచున్నవో ప్రతి భారతీయుడెరుగును. నేనిందులో దేనికీ అయినవాడనుకాను. మానవతా వాదానికే కట్టుబడినవాడను.

నా "ఆహ్వానకావ్యం"లో ఇలా అన్నాను.

"నాది భారతమ్ము పిదప నాంధ్రమ్ము
లేదు మతము గితము లేదునాకు
సత్యపథమె నాకు స్వర్గధామము నాకు
అంతరంగశుద్ధి యాత్మబలము"

ఈ మాటలు మత విద్వేషంతో చెప్పినవికావు. మతంపేరుతో కొందరు దుష్టులుచేసే అన్యాయాన్ని సూచించడమే నా ఉద్దేశ్యం.

ఈ ధర్మాగ్రహ కావ్యానికి తమ అనుమోదం తెలిపిన "ఆలంకారిక చూడామణులు" బహుభాషావేత్తలు "నిరాడంబరులు" శ్రీమూర్తి శ్రీ టి. భాస్కర రావు గారికి నా కృతజ్ఞతా నమస్సుమాంజలులు.

ఈ గ్రంథ ముద్రణకు పూర్తి సహకారమిచ్చిన మా పుత్రికారత్నం చిరంజీవి డాక్టరు ఎస్. శరత్‌జ్యోత్స్నారాణికి, అల్లుడు వి. వి. రమణకు నా యనేకానేకాశీర్వచనములు.

మోహనంగా ముఖపత్రం వ్రాసిన ప్రముఖ కవి, కథకుడు, చిత్రకారుడు శ్రీ శీలా వీర్రాజుగారికీ,

ముచ్చటగా ముద్రణ గావించిన శివాజీ ప్రెస్‌వారికి నాధన్యవాదాలు.

నా జన్మకు కారణమైన నా తలిదండ్రులు, స్వర్గీయులు, శ్రీ సురగాలి ఎల్లయ్య, పాపమ్మగారలకు వినయంతో తలవంచి నమస్కరించి యీ కృతిని సమర్పణం గావిస్తున్నాను.

"గుడికూలును నుయిపూడును
వడినీళ్ళన్ చెరువుతెగును వనమునుఖిలమౌ
చెడనిది పద్యంబొక్కటి
కుడియెడమల కీర్తి గన్న గువ్వలచెన్నా !"

19-10-1998
రసజ్ఞనిలయం
కాకినాడ.

జ్ఞానానందకవి

# ఈ ధర్మాగ్రహములో

# అంజలి

ఏ జన్మంబున నోము నోచుకొని తల్లీ! కంటివో నన్ను నీ
పూజా భాజనమైన గర్భమున దీప్తుల్ నిమ్ము సాహిత్యపున్
తేజంబిందు రహింపగా తెలిసెలే నీ స్వాంతంపు టార్ద్రత్వముల్
నా జన్మంబు ఫలించె వ్రాసెద నగణ్యంబైన సాహిత్యమున్

రెండేండ్లైనను నిండనట్టి నను తల్లీ! వీడి స్వర్గాన ను
ద్దండుండైన విధాతృ నాజ్ఞచన నాధారమ్ము లేనట్టినన్
కొండంతా నను బెంచినాడు పిత నీకుం గూర్తు సాహిత్యపున్
దండల్ శాశ్వత మీ ప్రపంచమున విద్యాలోక ముప్పొంగగన్.

జననీ! నీదు పవిత్రనామమును స్వచ్ఛంబైన పద్యాల నిం
డిన సారమ్మున డెందమందు దొలినే నీపూజ గావించి వ్రా
తును నీపై నొక కావ్యరాజమును ముద్దున్ స్వర్గమందుండి దీ
వనలిమ్మా! కయికొమ్మ మ్రొక్కు కవితా వాల్లభ్య సంసిద్ధికిన్.

ఆనాకంబున నీవు వర్తిలుచు విద్యాప్రౌఢ పారంగత
జ్ఞానుల్ దివ్య సభాంతరాళమున విన్నాణంబు జెన్నార నీ
జ్ఞానానందకుమార రత్నము పఠించన్ సత్కవిత్వంబు నీ
వానందంబున దేలవా? యదియు నాకానందముం గూర్పదా?

నాకిప్డిర్వది మూడు వర్షములు మేనన్ గ్రుమ్మె యుష్మత్కృపా
శ్రీకిం బాత్రుడనైతి సత్కవి జనాశీర్వాదముల్ గల్గె త
ద్రీచి కారుణ్య మరంద బిందువులు వ్యర్థీభూతమా కాదు నే
నేకైతన్ రచియింప లేననుట తల్లీ! పల్క సిగ్గయ్యెడిన్.

2

అవునా ? కాదను హేతువాదముల కేలా? సందు నీయంగ నే
ది విశేషంబును జూపుమంచు నెవడో తీంద్రించి లోలోన నీ
భువనంబంతయు మోయు వానివలె తప్పుల్ వట్ట లక్షింప నే
నెవరేమన్న సరే రసజ్ఞులిల వింటేచాలు నా కైతలన్.

25-12-45

# కనకాభిషేకము

అమ్మా ! శారద ! నీ కటాక్షమున నాకబ్బెన్ జగాత్కైతలి
ల్లిమ్ముం గూర్చిన యీ బహూకృతికి నీవేకారణంబౌదు వం
చిమ్ముం బల్కగ సంతసించెదను నాయీ యున్నత శ్రీకి ల
క్ష్యమ్ముం జూపిన నీ యుదారతకు జోహారుల్ సమర్పించెదన్.

తల్లీ! శారద ! నీ యనుగ్రహముచేతన్ నా కళావాణి శో
భిల్లెన్ నన్ను కళాప్రపూర్ణునిగ పృథ్విన్‌జేసి నిండించినా
వెల్లన్ గిరితి రాసులన్ దెలియనే యీనాటి సమ్మాన సం
పల్లాభంబులు నీవెగా దలచి సంభావింతు డెందమ్మునన్.

పటు విద్వత్తు గలట్టివారలను సంభావించు నీ దివ్య వి
స్ఫుట హస్తమ్మునకున్ నమస్కృతులు దీప్తుల్ నిమ్ము నీ భావపున్
ఘటనాశక్తికి మెచ్చుకోలగుత పైండావంశ మౌళీంద్ర! వేం
కట నారాయణ నీకు నబ్బెడిని సౌఖ్య శ్రీయశశ్చంద్రికల్.

దిగులుంజెందిన నా కళాసతికి నుత్తేజమ్ము గల్పించి నా
యగచాట్లంగని సంతసమ్మిడిన విద్యామూర్తి! సాహిత్య ని
మ్నగలం దేలిన మానవోత్తమునకున్ మాన్య ప్రశంసాంజలుల్
అగుతన్ దివ్యవిశుద్ధ భావునకు శ్రీ యల్. మాలకొండయ్యకున్.

నా సాహిత్యముగాంచి నా యెడద దిఙ్మాత్రమ్ము గుర్తించి యె
ట్లో సంతోషము గూర్పగా దలచి నాకుత్సాహముం గూర్చు వి
ద్యా సౌహార్ద విభాసు నూర్జిత యశోహాసున్ సుధా సాహితీ
భాసున్ వాగ్మిని పాత్రునిన్ సతము సంభావింతు స్వాంతమ్మునన్.

కళావై పోయిన సాహితీ సభలు చక్కం జేయగా నేరికిన్
పురమాయింపక కూర్మిలింపొసగ సొమ్మున్ ద్యాగ సద్బుద్ధిమై
ఖరుచుం బెట్టును సంతసం బొదవ నాగంభీర భావోన్నతున్
స్మరియింతున్ హృది సత్కళా ప్రభుని బొజ్జా ధర్మరాజాఖ్యునిన్.

తిన తిండిలేని వేళను నన్నుగని ప్రేమ
నన్నమ్ము వెట్టి నన్నాదరించి
చినిగిపోయిన కట్టుకొనునట్టి వసనమ్ము
లకు దుఃఖపడుచు వస్త్రమ్ములిచ్చి
పంచముండితడంచు పడదిట్టువారికి
బుద్ధిసెప్పుచు నన్ను బుజ్జగించి
ఆత్మ గౌరవమునకై ప్రాకువాడని
కడుప్రేమ మీరగా గారవించి

"వాడు కవిత మెచ్చి నాయభ్యుదయము కో
సరము కలలగాంచి సరసమతిని
మేలుగోరువాని సైలాడ పైడిత
ల్లిని దలంతు నాదు మనసునందు"

ఏడ్చినవారు కొందఱెపుడేడ్తురు సృష్టి రహస్యమిద్ది తా
మేడ్చిన లాభమేమి ? శ్రమయే మిగులున్ పరవాని బుద్ధినిన్
పూడ్చగ జూతురద్ది సరిపోవునె ? కాలము వారినెప్పుడో
ఈడ్చగ పోదుచేయుపనికెంతయు దీర్చును వడ్డితోడుతన్.

పనలేనట్టి కవిత్వపున్ రచనలన్ వ్యర్థమ్ముగా వ్రాసి వ
ర్గ సమారాధనమందు సత్కృతులతో గర్వాన దిర్గాడు ద్వే
ష సమాలీఢ కళావిరాజితుల శుష్కంబైన కావ్యాలకున్
వెన సంభావనమా ? యిదేమిటికి గుప్పింతున్ దిరస్కారముల్.

విసపుంగోఱలు సాచి మిక్కిలి కులద్వేషోగ్ర సర్పమ్ము వెన్
బుసలం గొట్టుచునున్న వేళ గరుణాంభోధుల్ దయాభావుకుల్
పసిమై నా కవితా పవిత్రికి మహాస్వర్ణాభిషేకమ్ము సం
బర మొప్పార ఘటించువారి కభివాదమ్ముల్ సమర్పించెదన్.

నలువదియేండ్లుగా తెలుగునందన వాటి జరించి మాలిగా
మెలగిన నాకు నేడమరె మేలిమి గౌరవ భాజనమ్ము నా
నలిగిన జీవితానకిది నవ్యతరంబగు శక్తినిచ్చును
జ్వల తరకావ్యరాజముల వ్రాసెద తెల్గులు మెచ్చనిచ్చలున్.

ఎవడెంత యేడ్చినను నా
కవనపు రాణింపు తగ్గక నెదుగు నిక న
న్ను విడిచివెళ్ళునె ? శారద
అవురా ! నీ తెలివిలేమి కబ్బుర పడెదన్.

కులముల్ గోలకు పోక సత్కవితకే కూర్మిల్ విడంబింప ను
జ్జ్వల సమ్మాన మొనర్చినట్టి గుణ భాస్వన్మూర్తులన్ బేర్మి మై
దలతున్ వారల సాహితీ పరతకున్ ధర్మస్వరూపైక వి
ద్యలకున్ జోతలు గుమ్మరించెద యథార్థంబిద్ది వాచింపగన్.

శ్రీనాథుండల ప్రౌఢరాయల కళాక్షేత్రమ్మునన్ హాటక
స్నానంబాడెనునాడు నేడిచట భాషాభిజ్ఞు లౌదార్య సం
ధాన ప్రక్రియ గారవింప బుధులానందింప వేదోక్తని
స్స్వనవ్రాతము సందడింప కనక స్నానాన నోలాడితిన్.

1-11-1974

## కాశేశ్వరరావు

ఒక మహాజ్యోతి భూమికి నొరుగునట్లు
నేలపయినొండు పండాకు రాలినట్లు
తెనుగు భువనమ్ము గగనాన నెనుబదేండ్ల
వృద్ధ యోధుండ రాలిపోయితివి నేడు.

నీ యింటన్ బస సల్పినట్టి మునిగాంధీ కర్మ సిద్ధాంతి ని
న్నో! యయ్యా! యని పిల్వగా జనితివోహో! పౌరుషాత్ముండవై
ఆ యాంగ్లేయులతో నెదుర్కొనగ సత్యాహింసలన్ దారిలో
నీ యుద్దేశ్యము శంసనీయమగు తండ్రీ! నీకు శ్రద్ధాంజలుల్.

త్యాగ సహితమైన ధర్మవర్తనమున
నడచి దొడ్డపేరు వడసినాడ
వయ్యదేవరయ్య యకలంకమగు నీదు
చరిత తెలుగునేల మఱువగలదె?

కాంతా కాంచనములపై
నింతేనియు నాసలేక నెనుబది యేడుల్
శాంతముగా బ్రతికిన మీ
శాంత్యుజ్జ్వల భావమునకు సాష్టాంగమ్ముల్.

1-14-1979

## ధాత!

ఇది శోకమున మున్గియెద గ్రహింపగ కైత
  ల్లు వాల్మీకి మహర్షి సీమ
ఇది తండ్రియాజ్ఞకు బదులుసెప్పని జాన
  కీజాని నడచిన క్షితి తలమ్ము
ఇది శంతనుని గంగకుదయించినట్టి నం
  దనుడు భీష్ముని ప్రతిజ్ఞా నిలయము
ఇది కుంతి కాంక్షలో పొదలిన కర్ణుని
  జమలేని గాఢ విశ్వాసభూమి

మాట తప్పనట్టి మహనీయ సంస్కృతి
కాలవాలమీ ధరాలలామ
అట్టి నేలజొచ్చినా పర్వదేండ్లకు
దృష్టి నిలుపుధాత! తెలియగలవు.

దేశములోని సంగతులదేపనిగా గమనింప ధాత్రికే
దోశని పట్టుకొన్నటుల తోచుచునున్నది బాగుచేయు వా
శే శతులై చరించిన మహిన్ రహియించునె సంస్కృతి ప్రభా
రాశులు సామరస్యములు రంజిలునే? జగడాల నేలలో.

ప్రాథమిక సూత్రమౌ మానవత్వమునకు
కులపు కాంస్య భిత్తి కలడ్డు కొన్ననాడు
మృగ్యమగు సంస్కృతి యిచట యేదిదారి?
ఇది కులమ్ముల దేశమోయీ! యుగాది.

ప్రారబ్ధమ్మిదిగాక యేమిటి ? హవాలా కుంభకోణమ్ము తీ
రే, రూటే మరి వేరయై కుదిపె ధాత్రీ గౌరవశ్రీలు వి
ధ్వారంబై నడివీధికెక్కె నెవడడ్డున్ చెడ్డకున్ దూరులా
వారే స్కాముల యూబిలో పడుట దౌర్భాగ్యమ్ము దేశానకున్.

సామర్థ్యమ్ముగలట్టి ధీకులకు నాశాజ్యోతిగా నిల్చి ధా
తా ! మాదేశము నుద్ధరింపగల సత్తా జూపి యీనేటి యీ
స్కాముల్ గూర్చిన యప్రతిష్ఠలకు సంస్కారమ్ము ఖండించి మా
లో మాకున్న విభేద భావముల క్రుళ్ళున్ దీసి భాసింపుమీ.

గ్రహియింపగలవె దిగాల మొగాల ని
ట్టూర్చెడు నాడవడుచుల బ్రతుకు
వహియింపగలవె దుర్భర దరిద్రజవాళి
గోడు పరిహరింప కొమ్ముకాసి
సహియింప గలవె దౌర్జన్య పూరిత వక్ర
గతుల రాద్ధాంతాల గ్రహణ బలము
దహియింపగలవె స్వార్థపరుని గుండెలో
తిరుగాడు నత్యాశ దిష్టిబొమ్మ

గొంతువరకు మ్రింగి కోటాను కోటుల
స్కీము స్కాములోన జిక్కువడిన
గడుసు నాయకులకు గల్ల న్యాయసూత్రమ్ము
కాలనిర్ణయమ్ముగాదలంతు.

ఈ యుగాదులు రానిచో నేమికాదువ ?
జరుగవలసినవవి కాలచక్రమందు
జరిగితీరు నొడ్డారించు జనుడెవండు ?
చెప్పినదె చెప్పుచుంటిని తప్పదేమొ ?

ప్రజలను మోసగించు పరిపాలకు లేలిన నేలలోన నీ
యిజముల గోలలోన నభివృద్ధికి తావిసుమంత లేని యీ
బిజుగుల బాటలోన నిఱుపేదలు పట్టెడు బువ్వకోసమై
గిజగిజలాడుచో నిచట గీతల వ్రాత లనర్థకంబులో.

ఇది నీకు తగదురా! యీ యబలామణిన్
ప్రొయ్యిలో కుక్కి చంపుట దురాత్మ!
ఇది నీకు తగదురా? యీ యాడపడుచుని
మొసలి కర్పించుట మూర్ఖ హృదయ
ఇది నీకు తగదురా? యీ దళిత స్త్రీని
యిటుల హింసింప నికృష్ట చరిత!
ఇది నీకు తగదురా? పెదవి విప్పని పేద
గుడిసె హరించుట గుండగొయ్య

అని నిజమును వచించిన వినరు విన నా
కండులేడు నీవే చెప్పగలవు ధాత!
విషపు బావాల సంస్కృతి విఱ్ఱవీగు
భువనమిది దీనికెవ్వడు బుద్ధిసెప్పు.

గోతుల్ ద్రవ్వుచు కొంపకూల్చుచు కుయుక్తుల్ పన్ను గూండాలకున్
జాతి ద్వేషుల కప్రసిద్ధులకు పెన్ సత్కారముల్ సాగుచో
ధాతా! యేమిటి? యిందులోని పరమార్థం బేమిటో మమ్ము నే
ఖాతాలో జమచేసెదో తెలియ దగ్రాహ్యమ్ము మాబోంట్లకున్.

ఏదిరా యిచట బ్రాహ్మీ విభూషణునకు
శిరము వాల్చగ చెప్ప చిన్న కొంప
ఔనురా సుకవితా శ్రీనాథునకు నిట
నేదిరా జీవింప భృతి యొకింత

10

పెదవెంకి ఋషి పద్య విద్యా ప్రభువునకు
నేదిరా సర్కారు సాదరమ్ము
నిగనిగల్ కయితలు సొగయించు నా మహా
కవికేదిరా కాస్త గంజిబువ్వ

ఇది తమాషా ప్రజారాజ్య మిది నిజమ్ము
కళలపంటలు పండని కర్మభూమి
నీ హయామున కళలు పండింపవోయి
ధాతృ వత్సర వర్షబేదాల మాన్పి.

# మతము

"హితము నెఱపనట్టి మతమన్ననది యేల ?
శాంతినిడని సాధు సంఘమేల ?
దివ్యమైన మానవతను విభాగించు
మతము బూడ్చి పెట్టవలయు ధ్రువము".

# బంగారు భూమి

ఈ శుభ పుణ్యకాలమున నీ సుముహూర్త మహోత్సవ ప్రభూ
తాశయవేళ నీ మధురతా రస బంధురతా మనోజ్ఞ దీ
ప్తాశయ పర్వకాలమున నక్షయమైన తెలుంగు కీర్తి ది
గ్దేశములన్ రహించెడిని దివ్వటి నెత్తుము తెల్గు భామినీ!

గుంజుకొంటివి తొల్లి కుటిల మానసవైరి
దోశ్శక్తి నణచి నమశ్శతమ్ము
పుంజుకొంటివి తొల్త భువన బాంధము గమా
యింప కీరితి పూలమంపుజల్లు
రుంజుకొంటివి పూర్వ మంజసా బాగా ప
హారులౌ యొరుల దురాగతాల
నంజుకొంటివి మున్ను నవమాధురీ ఝరీ
సంకాశ సుకవితా శస్త్రరుచుల

ధరణి చక్రమునకు మిఱుమిట్లు గొలుపంగ
తెనుగుపదము తీయదనము బంచి
నిఖిల జగతి పూజనీయత గణియించు
తెలుగు రాజ్యలక్ష్మి వెలయుమమ్మ!

బంగారమ్ము ఫలించు పంటపొలముల్ పావిత్ర్య సుక్షేత్ర రా
జింగల్యాణ ప్రదంబులౌ రసధునుల్ జీవాలకు జీవమై
సింగారింప శిలోచ్చయాలు పహరా సేయంగ నీ బాగ్య శ
క్తిం గీర్తించెద నాంధ్రరాజ్య జనయిత్రీ! యెంత ధన్యాత్మవో!

చవులూరించిన యట్టి నీదు సుషమా సౌభాగ్య సంపత్తికిన్
భువనంబుల్ గొనియాడ సాగినవి కాపుల్‌గాచె నీ భావ రా
జ విభాశ్రీ ఫల వృక్ష సంతతులు సాజంబైన దాక్షిణ్య మూ
ర్తి వి నీ కీరితి చంద్రికల్ దెసలు తల్లీ! పర్వె పోషింపుమీ!

పూయింపుమీ ముగ్ధ మోహనరాగ సూ
నాలు నందనుల స్వాంతాలలోన
కాయింపుమీ క్రమగాఢోజ్వ లోజ్వల
కాంతిరేఖా చంద్రికలు జగాన
ప్రాయింపుమీ మధుర మహాంధ్ర ప్రధమాన
పౌరుషాకృతులు విశ్వ ఫలకాన
మ్రోయింపుమీ పొట్టిముని త్యాగ సహితమౌ
ఆత్మార్పణంబైన యమృతవీణ

పూర్ణ విజ్ఞతా ప్రభూత చైతన్యమ్ము
నిండనిమ్ము నీ యఖండభూమి
గంపెడు బలగమ్ము గలదాన లోకాన
కలిమి బలము గలుగు తెలుగుదాన.

కలశన్ గుత్తకు స్వీకరించిన యశఃకాముల్ తమాషా రస
జ్ఞుల హస్తాలను గింజుకొన్న మధురస్ఫూర్తి న్నివేదంబించు మేల్
తెలుగుంగైత మిటారి కాశ్రయము లేదేమో? పురంధ్రీ! సము
జ్జ్వల సాహిత్య జగత్ప్రణేతల యదృష్టంబున్ సమీక్షింపుమీ!

పండింతువా విశ్వభాండమ్ము మెచ్చునాం
ధ్రమధుర కవన కేదార సీమ
నిండింతువా కళాఖండ సృష్టి బ్రహ్మ
శిథిల జీవితములన్ జీవశక్తి

ఖండింతువా కొఱగాని వాక్కులు పల్కు
వదరుబోతు ప్రలాప వాక్య వితతి
దండింతువా తప్పుదారి త్రొక్కిన స్వీయ
కుక్షింభరుని దంభలక్షణమ్ము.

ఆత్మ నిగ్రహమ్ము నంత గోల్పోవుచు
పరులకెపుడు చెక్క భజన సేయు
ప్రాణ గొడ్డమైన బ్రతుకు చెండింతువా ?
అమృతరూపిణీ! మహాంధ్ర జనని !

స్ఫూర్తి శ్రీ సముపేతులై హృదయ సంపూర్ణత్వ మాశించి ని
ర్వర్తింపందగు నా సహోదరులు విశ్వక్షోణి సంక్షేమమున్
గూర్తింపందగు నీ ప్రణాళికల శక్తుల్ దీవ్యమౌనాడు ని
య్యార్తింబొందిన నా తెలుంగులకు సౌహార్దమ్ము సంధిల్లెడిన్.

హ్రస్వంబైన సహోదరత్వములు స్వీయ క్షేమ వాంఛా తప
శ్రీన్ స్వేచ్ఛా పరికల్పితాశయము రాశీభూతమై యొప్పగా
నిస్స్వార్థమ్మును గోలుపోయిన సుతా నీకానకున్ నేడు దీ
క్షా స్వర్ణాంచిత కంకణమ్ము విధిగా గట్టింపు మాంధ్రావనీ !

15-4-69

# గండపెండేరము

మోషల్ వెట్టెడు నాదు బాల్యమున నుగ్గుంబాలతో పాటుపి
యూషంబున్ గలబోసి పెంచితివొ? లేకున్నన్ మహాసాహితీ
భాషాయోష మదీయ జిహ్వాపయి నావాసించునే? నేడునా
భాషా సత్కృషికిన్ లభించె జననీ 'పాపాంబ' యీ సత్కృతుల్

అరుసంబుల్ హవణిల్ల మీదయిన యధ్యక్షత్వమందీ యశో
గిరిపైనెక్కిన నాకళాసతికి కల్గెన్ మేల్మిబంగారుగ
గ్గెరసన్మానము సింగిరెడ్డికులజా! కేల్మోడ్పు సాహిత్యసుం
దరమూర్తీ! భవదీయవాక్కులు మరంద శ్రీనిదానంబులౌ

తీయని తేటతెన్గు పదధేనువు బిండి రసైకమాధురీ
గేయకవిత్వ మున్నాడివి కీర్తిమరీచుల విశ్వగౌరవ
స్థాయినినిల్పి యున్నతినిదాల్చిన ధీమణి! సింగిరెడ్డినా
రాయణరెడ్డి! మీపలుకులందు పసందులు చిందులాడెడిన్

శూలియు వెన్నుడున్ త్రిపురసుందరియున్ పరిశుద్ధదేసుడున్
వ్రాలిన నేల నాదు నిరవద్య కవిత్వ సరస్వతీపదా
బ్జాల నదించుకింకిణుల చక్కనిశబ్దము లేలుగాక! యం
దాల పసిండిపెండెరము దాల్చునుగాక! మదీయవాణియున్

అమితో దారతతోడ నాయలతి కావ్యాలన్ సమీక్షించి మో
దము సంతృప్తిగ బొందినాపయిని బద్ధప్రేమ జూపించినా
రు మహోదార చరిత్ర! చౌదరి! మహేంద్రుల్ మెచ్చుకొన్నారు మీ
సమతా మానవతా స్వభావమును ప్రస్తావింప తథ్యంబగున్

కళలకు స్థానమిచ్చిన యఖండులు రాజులు పోయిరీ ధరా
తలమున వారు నిల్పిన సుధామయ మంజుల దివ్యసాహితీ
నిలయములైన సత్కృతులు నిల్చిన విప్పటికిదాక యొప్పుడున్
నిలుచును సత్కవీశ్వరులు నిండినభూములు స్వర్గతుల్యముల్

తొలియలసాని పెద్దనకు తోరముగాగ పసిండిగగ్గెరన్
చెలిమివహింపగా దొడిగి నేటికి నీకవితా ప్రపంచమం
దలరిన కృష్ణభూపుని విధాన కవిత్వ చరిత్రలోన జ్యో
తుల కులదీప! నిల్చెదవు తోషణమొప్పగ బ్రహ్మకల్పముల్

సొగసుల్ నిమ్మెదు నాంధ్రభాషకు యశస్సున్ గూర్ప పాశ్చాత్యులే
పొగడన్ బోధనసల్పవచ్చిన గుణాంభోరాశి! మీ వాక్కులో
నెగడున్ సుందరతా ప్రబోధములు నందింపించు మీ వార్తకున్
అగుతన్ దోయిలి "కొత్తపల్లికులదీపా!" వీరభద్రాభిధా!

మాయయు మర్మమింతయును మాటకునైనను లేనియట్టి శ్రీ
బాయన వంశజున్ మధుర వాగ్మిని వక్తృశిరోమణిన్ జగ
చ్ఛ్రేయము గోరుకొన్న గుణశిష్టుని పాత్రునకౌతః వందనా
లీయెడ సత్కవిత్వమన నెంతయు పొంగిన కారణమ్మునన్

నాడు కనకాభిషేకమ్ము నాకు వేడ్క
ఘనులు కొనియాడ చేయింపగలిగినారు
నేడు కూడను గండపెండెరపు సభను
ఘనులు కొండాడ చేయింపగలిగినారు

ఈసు మనస్సులోనెదిగి యెంతయు దుష్టపుచింతచే దుర
భ్యాసములో మునింగిన దురాత్ములు దుర్జనులీ కుసంస్కృతి
వ్యాసులు పెచ్చుమీఱిన దివాణము దగ్ధముగాక యేమగున్
వ్రాసినవాని వ్రాతకు తురాయి లభించినచో విశేషమా!

ఒక కవికేమికావలయు నుండుటకింత కుటీర మింత తిం
డికి సరిపోవుబత్తెము కనీసపు వస్త్రములింతియేకదా!
సకలమహీతలంపు సుఖశాంతులకోసము పాటుపడ్డ వా
రికి కవులైన వారలకు తృప్తినొసంగని దేశమెట్టిదో?

నావర్గమ్మొకటే సమస్తమునకున్ నాందీసుమీ యంచునే
వేవోవాక్కుల నాడువిజ్ఞులకులేదే? హేతువాదమ్ము ప్ర
జ్ఞావైశద్యము లొక్కవర్గమునకేనాగుత్త? యీ మాటలో
జీవస్ఫోరక కాంతిలేదు ఫలియించెన్ నాతపస్సింతకున్

విద్యావార్ధుల సన్నిధానమున నివ్వేశన్ ఋషిప్రోక్తమత్
పద్యగ్రంథ సరస్వతీ మృదుల పాదాబ్జాతమ్ము గీలించెనీ
హృద్యోత్కర్షవు పెండెరంపుసభ నాకిచ్చెన్ సముత్సాహదీ
క్షోద్యద్దివ్యదనంత భావనలు నాకుర్విన్ తపః ప్లవ్యాడన్

నా కనకాభిషేక తరుణమ్మున మెచ్చిన యాంధ్రసాహితీ
లోకము నేడుగూడ తమలోని మహోన్నత సంస్కృతి ప్రదా
శ్రీకము సందడింప నరుసింతురుగాక సరస్వతీ వధూ
టీకమ నీయదృఙ్మధురతేవకు లేవెటివంటి భేదముల్

మహితమైనట్టి రామాయణ కావ్యమున్
మేల్మినందించె వాల్మీకిమౌని
ధృతినిర్ధరింప భారతమును రచియించె
పరమధర్ముడు పరాశరుని కొడుకు
ఘనకాళికాంబ మోహన కటాక్షమ్ముచే
ఘంటానవ్రాసెను కాళిదాసు
సమరరంగమున ధీచాతుర్యమలరగీ
తావార్త జాటె యాదవకులుండు

2)

"మునుపు చదువులేని ఘనులైనవీరలు
కవనవిద్య లరయగలిగిరెటుల?
కవిత పూర్వజన్మ గంధమ్మువల్లనే
కలుగుగాని చదువు వలనగాదు"

మేటిదైనట్టి పుష్పకిరీటమొండు
నాశిరస్సీమ నలరించి నాదుకవన
విజయలక్ష్మిని వినుతించి పెద్దచేసె
రసికతామూర్తి కొప్పాక రామకృష్ణ.

తాంద్రపాపయ్య సర్దారు ధైర్యశ్రీకి
ఆకరంబైన తాలూకనాది
కవితావిపంచికా గానమ్ముమార్రోగు
పేరొందు పెదపెంకి యూరునాది
గీర్వాణభారత కృతిరచించిన మహా
కుశలుడౌ వ్యాసర్షికులమునాది
మహితలక్షణమైన మానవతావాద
భావాన నడచెడు త్రోవనాది.

"ఏను కవిసార్వభౌముడ! ఏను"విశ్వ
నాథ"శిష్యుండ! సాహితీనందనమున
బెడగుకబ్బంపు విరులగల్పించినట్టి
భువనహితుడ! జ్ఞానానంద కవిని నేను"

# ప్రత్యభినందన

డెబ్బదియొక్క వర్షములు తీవి మెయిన్ గతియించె కాలపున్
బెబ్బులి దాటికాగి యభివృద్ధి పథమ్మున సాగు నాకొగిన్
సెబ్బర లేని జీవనము సేయుచు నున్నటువంటి నన్నికన్
డెబ్బది రెండవేగతిని ఢీకొననున్నదొ ? యెట్టులున్నదో ?

ఎన్ని యుదయాస్తమయములు నన్ను తాకి
దాటవలయునో బ్రతుకు పథమ్ము లోన
ఎన్ని కడగండ్ల పడగండ్ల నీ జగాన
తట్టుకొనవలెనో నాకు తరమె ? నుడువ ?

ఈ సాహిత్య తపోవనాన ఋషినై యీర్ష్యా మహాద్వేష బా
ధా సంక్లిష్ట విమూఢ సంస్కృతికి చిత్తంబీక గాంధ్యహిం
సా సూత్రార్థ్యములో జరించి జగతీ సంక్షేమ మాశింతు నే
నా సాహిత్య కళాప్రపూర్ణుడను జ్ఞానానంద కవ్యగ్రణిన్.

ఈ విజ్ఞాన వివేక సంపదలు నావేయంచు మూర్ఛించు వా
డా! వీర భ్రమలో మునింగిన జడుండా! విశ్వ విశ్వమ్ములో
నీ విజ్ఞానమదెంత ? నీ బ్రతుకు సందేశమ్మదేపాటిదో
ఈ వర్గాల కులాల మధ్యమున భాయీ! నిల్చి పోరాడుమా!

సమయంబింత లభించుచో జన సమస్యల్ తీర్పగా నెంచి ని
త్యము పేదప్రజ కాత్మ బంధువయి చేతల్ చేసి విద్యుక్త ధ
ర్మముగా స్వాంతమునందు నెంచిన దయార్ద్రమ్ముండ! వాక్రువ్వ మీ
యమితోత్సాహము బాగు మంగపతి రాయా! నా నమోవాకముల్.

తలపన్ మీదగు ధీవిశేషములు స్తుత్యంబంచు హర్షాన నా
జ్ఞలు వ్రాకుత్తురు మంచిసేయుటలె మీ జన్మంపు హక్కౌమొ స
త్కళలన్నన్ సముదార భావమున నుత్సాహమ్ము సూపించు శ్రీ
పులి వీరయ్య" సరస్వతీ నిలయ! మిమ్ముంజుట్టు సమ్మోదముల్.

పొంగిన గంగాధారా
భంగిని మీమధుర వాక్ప్రవాహము దొరలున్
రంగారు మీదు క్రియలవి
బంగరు సమమగు ప్రొఫెసరు పాత్రుడు గారూ!

సకల కళల మెచ్చు సాహితీ బంధువు
ప్రథితగుణుడు వెంట రామచంద్ర
రావు గారికగుత రమణీయ శుభపరం
పర లనారతమ్ము వసుధలోన.

శ్రీ శివలెంక వంశజన శేఖరులైన ప్రకాశ రాయనిన్
దేశిక వర్యునిన్ విమల ధీమతినిన్ మధురైక భావనా
వేశుని, పార్వతీ పతి పవిత్ర పదాబ్జములన్ భజించు దీ
క్షా శయమూర్తినే దలతు స్వాంతమునందు జగాన నిచ్చలున్.

కులమున్ ప్రక్కకునెట్టి సత్కవితకున్ కొండంత యండై మహో
జ్జ్వల సంస్కార మనస్సుగల్గిన యశస్కాముండు సాహిత్యపున్
జలధిన్ మున్కలువేసి పేర్గనిన ఘంటా వంశ్యశ్రీబుచ్చి బా
బుల వైశిష్ట్య మనోజ్ఞ భావనకు సంపూర్ణ ప్రశంసాంజలుల్.

అమృత స్వాంతుడు మానవీయతకు జోహారించు సన్మార్గుడు
త్తమ సాహిత్య పథమ్ములో నడచు సత్యాలాపి విశ్వమ్ము శ్రే
యము నాశించు సదాశయుండు నిరవద్యోత్ ప్రోజ్జ్వలత్ ధీవి శే
షము జెన్నారెడు డాక్టరైన ఘనుడిజ్ఞాదన్ ప్రశంసించెదన్.

సొంపులు గల విజ్ఞానపు
చంపక సురభిళములాంగ్ల శాస్త్ర గ్రంథాల్
గంపళ్ళ కొలది పిల్చిన
"కొంపెల్లా" మీకు శుభము గోరెద పుడమిన్.

పొగడె నా శారద జగజగ్గు దిలకించి
విశ్వైక కవి నాథు విశ్వనాథ
అడిగె నా గ్రంథమ్ము నంకితమై అయ్యె
దేవరాన్వయ హేలి! దీవరుండు
కడిగె నా శిరమును కనకాభిషేకాన
కర్మవీరుడు బొజ్జ ధర్మరాజు
తొడిగె పెండెరము నాయెడమ పాదానకు
రహిని జ్యోతుల సీతరామమూర్తి

ఎందరెందరో సాహిత్య సృష్టికర్త
లెలమి పొగడిరి నాదు కైతలను గాంచి
శారదాదేవి ఘన కటాక్షమ్ము గలిగె
వసుధ నికపైని నేమి కావలయు నాకు.

కులముల్ లేవని గొంతుచించుకొని పల్కుల్ పల్కు సోదర్యులా
కులపున్ బేరున గొప్ప గొప్ప పదవుల్ గుర్తింపులం బొంది యా
కులమున్ పెంచెదరట్టి వారలు దగాకోరుల్ ప్రజాస్వామ్య మం
దలరన్ హైందవజాతి సంస్కృతి ప్రవిధ్వంసంబు కాకుండునే?

చదువులేని వాండ్రు సంఘాలు పెట్టిన
యవసరమ్ము వారి కాశ్రయమ్ము
చదువుకొన్నవాండ్రు సంఘాలు పెట్టిన
వంగనాచితనాము తొంగిచూచు.

మహిత సంస్కృతికి పెన్మచ్చగా నిల్చిన
కులకాంస్య భిత్తికల్ కూలునాడు
దేశీయ ద్రవ్యమున్ తెగ మెక్కి నీల్గెడు
దోపిడీగాండ్రను దునుమునాడు
సమరస భావమ్ము సమయింప పేట్రేగు
దుష్టశక్తుల దుమ్ము దులుపునాడు
కమనీయ కళల వర్గాల సృష్టించెడు
కుటిలాత్ములకు జెల్ల కొట్టునాడు

పరువువీడి కాకాపట్టి బ్రతుకువాండ్రు
సిగ్గువిడుచుచు పైరవీ సేయువాండ్రు
బలిసిపోయిన వసుధకెట్టుల లభించు
ప్రగతి కనుకూల సంస్కార భావపటిమ.

పొట్టివి పొడుగగు పంక్తులు
నెట్టో కూరిచి యహమ్ము హృదయము నిండన్
బెట్టును చూపించిన వా
డెట్టా కవియౌను ? రసికు లెఱుగరె వానిన్.

ఆంధ్రమ్ము తెలగాణ యైకమత్యమునకు
తెలగాణనేనురా తిరిగినాను
ప్రతిన బూనుచు తెల్గు భాషాభివృద్ధికి
గ్రంథాలు నేనురా వ్రాసినాను
జాతీయ సుకవితా సమ్మేళనములోన
ముదమార నేనురా చదివినాను
మానవత్వపు దివ్యమార్గమ్ము శాంతికి
నెలవని నేనురా తలచినాను

23

ప్రతిభకును చోటులేని యీ క్షితి తలాన
కుల మహా వ్యాఘ్రి కాంౘడించు కువలయాన
ఇల్లు వాకిలి లేకనే ఈ విధాన
పరమ తృప్తిమైనేనురా బ్రతుకుచుంటి.

16-7-1993

# తెలుగుతల్లి

ముప్పది యెన్మిదేశుల ప్రభూత భవజ్ఞన నంపువేడుకల్
ముప్పిరిగొన్గ జేసికొను ముద్దుల సంతతి యేడుకోట్లు నీ
గొప్పదనంబు చాటుకొన కూడిరి నేడిట మేలి జాడలో
నిప్పుడు సాగుచుండుట తల్లీ! విజయాలకు నాంది పల్కుటల్.

కదలాడుచున్నవి కస్తూరిబా స్వామి
ప్రేమైక సహన చంద్రికలగుంపు
విహరించుచున్నవి వినువీధి జవహరు
శాంతి కపోతాల క్రాంతిలయలు
ఎసలారుచున్నవి ఇందిరాగాంధిజీ
యిరువది సూత్రాల పరిమళాలు
కనిపించుచున్నవి ఘనుడు రాజీవ్‌గాంధి
కలలు రోజ్‌గార్ పథకములయందు

పరువులెత్తుచు నున్నవి ప్రజలలోని
ఐక మత్య మహాభావమందు నంద
ఔక్కటేయన్నధిష్ణ్యమం చూహసేయ
తలపనిది మహాభాగ్యమ్ము తెలుగుతల్లి!

ముందుకు సాగు నభ్యుదయపున్ పనిపాటల జూచి యీర్ష్యతో
కొందఱు వెక్కిరించెదరు కొందఱు ప్రేలెద రివ్వి యన్నియున్
నందడిలో నదేమియ ప్రశాంతిని భగ్నముచేసి చట్టమున్
ముందుకు సాగనీని తరమున్ గమనించుచు తప్పుదిద్దుమీ ?

పంచవర్ష ప్రణాళికా పథములోన
పృథుల చైతన్య విస్ఫూర్తి లేలుచున్న
సమయమిది విశ్వభువన ప్రశంసలంది
తిరుగవలె తల్లి! కీరితి యరద మెక్కి.

బహు భయంకరముగ ప్రకృతి ప్రకంపించి
విరుచకపడి నోరు వెళ్ళబెట్టి
ప్రాణికోటిమ్రింగె "లాటూరు" ప్రాంతాల
జనని! యిది మహా విషాదగాథ!

ఎవడీ గుప్పెడు మట్టితోడ నరులన్ సృష్టించి విశ్వమ్ములో
నివసింపన్ విసరెన్ విచిత్రముగ శాంతి స్థాపకుండైనయా
దివిష న్నాయకుడే మహోగ్రుడయి యీ తీరున్ సమర్థింపగా
అవమానంబగు వానిస్థాయికిది గాదా! మాతృ మూర్తీశ్వరీ!

వెలసెన్ విశ్వదిగంత రాశములలో పేర్గన్న మేధావులు
జ్వలురౌ తెల్గుల నీయనుంగు సుతులుత్సాహంపు దీ వైభవాల్
తలపన్ భావిజనాలు వారి ధిషణాతత్త్వమ్ము కొండాడగా
వలయున్ త్వజ్జననమ్ము వేళ జననీ! భాసించు సౌభాగ్యముల్.

1-11-1994

## యువ :

రాజకీయాల నేరాలతో జీవించు
వంచకులాట కట్టించునాడు
అనిశమ్ము స్వార్థమై యనృతాల వచియించు
హీనుల నోళ్ళు మూయించునాడు
కులమతఛాందస క్రూర కర్మఠుల దు
శ్చేష్టితాల సమాధి సేయునాడు
విత్తమ్ము నార్జింప పెడత్రోవలను ద్రొక్కు
గూండాల శక్తుల చెండునాడు

ప్రజలలోని యనైక్యంపు భావజాల
ముడుగునాడు నీరాక మాకిడునుగాక
నిర్మలానంద జీవనోన్మేష గరిమ
"యువ" వినూతన వర్ష ప్రభూ ! హసాదు.

పాశర్లపూడిలో భయదమౌ బ్లోఔటు
జ్వలదగ్ని నాల్కలు సాచునాడు
శ్రవణపేయముగ ధారాపాతమున సాగు
వేద ఘోషణలు స్తంభించునాడు
ఘన కోనసీమలో కనక సస్యమ్ములు
మసియౌచు బుగ్గిగా మారునాడు
భీతిల్లి యసురఱచేత గుప్పిటబట్టి
సీమలో ప్రజలు శోషిల్లునాడు.

నా వరాలతల్లి నాదు యశోవల్లి
తెలుగుతల్లి యెంత నలిగిపోయె
యూహలోనకూడ 'యువ' నీకు తెలియదు
నీకు సెప్ప వెఱవనేల నేను ?

గంతల్ దాల్చిన మానినీ తిలకమా గాంధారి దేశమ్ములో
తంతుల్ తంతులుగాగ సాగుటలు నీ తంత్రాల వ్యూహమ్ములో
పంతాలంబడి మిత్తికోగిరముగా పాల్పడ్డ నా జాతికిన్
అంతో యింతో మరెంతో మంచి మనసయ్యా! యియ్యవోయీ! యువా!

ఎవడాప గలడురా? యీ మహోదారుణ
మారణకాండ దుర్మార్గ చరిత
ఎవడాప గలడురా ? యీ నిత్య మాన భం
గాల దౌర్భాగ్య సంస్కార నికృతి
ఎవడాప గలడురా ? యీ యసూయా ద్వేష
దుష్ట భావుకుల విద్రోహచింత
ఎవడాపగలడురా ? యీ భిన్నపార్టీల
కల్లోల తీవ్ర సంఘర్షణమ్ము

ఎవ్వడాపగలడు చివ్వకు కాల్దువ్వు
కులమతాల వృషభ కుంజరముల
తెలుగువారిలోన గల భిన్నభావాల
కూపిరియవద్దు "యువయుగాది"

ప్రగతికి దారిలేదు ప్రతిభా పరిపూర్ణుని కిల్లులేదు సో
యగపు తెలుంగు కైతలకు నాదరణంబిసుమంత యీదగా
జగమునలేదు దద్దమలు సౌఖ్యములన్ బొరలాడుచుందు రే
పగిదిని పద్య విద్యలకు పట్టముగట్టుచు పల్కరింతువో.

ఈ బోఫార్సులు స్కాము స్కీములు ధనంబే లాగునన్ దోచుపెన్
జాబుల్ దేశములోని విత్తమునకున్ కాలాడె ప్రశ్నించుచో
ఏ బాబిచ్చు జవాబు పిచ్చిజనులీహి ! యన్న సిగ్గేది ? నీ
వో బాబూ ! యువ ! క్రొత్తవత్సర ప్రభూ ! యోజించి తీర్పీయుమీ ?

దయ్యముతోడు వడ్డనిక ధారుణిలోన జయమ్ము గల్గిపెన్
ధాయ్యయగున్ సుదూహలకు ధర్మవిధిజ్ఞుడు నాశజెంది తా
నెయ్యదిగోరు కొన్నదియే ఫలియించు నిజమ్ముగా కిలో
బియ్యము రెండురూకలకె పేదలకబ్బుట సాహసంబగున్.

మద్యహితుల మత్తు మాన్పింపజేసిన
దూబగుంట సతికి దోయిలింపు
శాసనమ్ము ద్వార సాధింపజాలిన
తెలుగు సింగమునకు పలుకరింపు.

చెలగునా ? నా తెల్గు పొలములో ననిశమ్ము
గమ గమ సౌహార్ద గంధవహుడు
మలగునా ? పొట్టిరాముల పుణ్యభూమిలో
జమలేని త్యాగాల స్యందనమ్ము
వెలుగునా ? బడుగు జీవుల గుండియలలోన
నవ్యజీవన కిరణాల దివ్వె
కలుగునా ? తిరకాసు గల నాయకులలోన
మహిమాన్వితంబైన మారుమనసు

తొలగునా ? వివేకదూరులు సల్పు దౌ
ర్జన్య కుటిల భీకరంపు చర్య
పగ్గెసూపి వారి నుగ్గుగావింపుమీ
యుపదగాగ మాకు "యువ" యుగాది.

29

ఈ వసంతపు పరభృతము లాలాపించు
పాటయేల ? మధుర భావమేల ?
నా తెలుంగు జాతి ఖ్యాతి మిన్నందుచో
అదె యుగాదియౌ! యువా! యుగాది!.

1-4-95

# గోపీనాథరెడ్డి

మీ రెడ్డీంద్రుల పాలనమ్మున సుధోన్మేష ప్రథా సాహితీ
శ్రీ రంజిల్లిన దప్పుడిప్పుడును వాసించున్ కళాకావ్యపున్
సౌరభ్యంబులు తెల్గు భూస్థలిని మీ సౌమ్యస్వ భావాల్ దయా
వీరత్వాలు ప్రశంసనీయములు గోపీనాథరెడ్డి ప్రభూ !

నియతిమైసాగు మీ నిశితంపు దక్షతన్
ఘోరంపు నేరాలు నీరసించె
ఉల్లమందొదుగు మీ వ్యూహంపు రచనలో
బీభత్సకారుల బెడదతగ్గె
ప్రాకట్యమైన మీ చాకచక్యమ్మున
జిల్లాకు శాంతి సుస్థిరత కలిగె
నిరుపమానంపు మీ నిపుణత్వమునకు ర
క్షణశాఖ కబ్బె రాష్ట్ర ప్రశస్తి

చంద్రమౌళి పాద సరసీ రుహమ్ముల
గుండెలోన హత్తుకొన్న గోపి
నాథరెడ్డి మీపన ప్రభావమువల్ల
జనులకెపుడు మంచి జరుగుగాక !

మీరా సుందర విగ్రహుల్ తెలుగులో మేలైన భావాలవి
స్ఫార ప్రజ్ఞ నుపన్యసించెదరు విద్వాంసుల్ ప్రశంసింప సం
స్కారంబున్ గల రెడ్డి భూవిభుల వంశంబందు జన్మించి యా
పేరున్ నిల్పుచునున్న ధీ నిధివి గోపీనాథ రెడ్డ్యగ్రణీ.

కళలన్ పోషణ నేసి సత్కవుల కాస్కారమ్ము గల్పించి ప్రో
జ్జ్వల కీర్త్యున్నతులన్ వహించిన ధరాజానుల్ మహాధీరతా
నిలయుల్ రెడ్డి విభుల్ చరిత్ర తెలుపున్ మీరట్టివారే సుమీ!
వెరిమిన్ వాస్తవమున్ వచించితిని గోపీనాథ రెడ్డీశ్వరా!

తొడిగినాడొక రెడ్డి కడుభక్తి శారదా
చరణమ్మెసంగ బంగరపు దొడుగు
అడిగినాడొక రెడ్డి యమృత భావుకుడగు
కవిని నంకితమీయ కబ్బమొండు
కుడిచినాడొక రెడ్డి తొదరి సత్కవితోడ
ముదమార మృష్టాన్న భోజనమ్ము
నడచినాడొక రెడ్డి యొదయందు కవిరాజు
ప్రీతిమైగిసిన గీతలోన

కవుల నాదరించి కనక సత్కారాలు
సలిపినారు రెడ్డి తెలుగు విభులు
వారిబాటలోన పయనించు మీకొత
నవశుభాలు గోపినాథరెడ్డి.

1-1-1993

# భావ !

ఏళ్ళైనా? జననీధరిత్రికయి యేవేవో కలల్ గంటు వే
నోళ్ళన్ దంభపువాక్యముల్ పలుకుచున్ గొంతుల్ ప్రసారించుచున్
బళ్ళల్ గ్రుద్దుచు తీక్ష్ణశబ్దములతో ప్రజ్ఞన్ ప్రదర్శించువా
రిల్లే! చేసినదేమి? కన్గొన నుగాదీ! భావవర్షాధిపా!

ఈకల్లోలకులాల పాలనములో నేడే దరిద్రాళికిన్
శోకజ్వాలల తప్తజీవులకు పస్తుల్ వడ్డ దైన్యప్రజా
లోకవ్రాతముకింత సంతసము క్రుళ్ళున్ కుచ్ఛితంబైనయీ
పోకిళ్ళన్ గనిపెట్టిత్రుంచి సమతన్ పోషింప నర్థించెదన్

నిలువెల్లన్ గసిరేగ క్రౌర్యమున ఖూనీసేయుగూండాలపెన్
జులుమీ యభ్యుదయ ప్రణాళికలతో జోడించినారేమొ? యె
ట్టుల గూండాయిజ మంతరించును మఱెట్టుల్ శాంతిపారాడు నీ
వలనన్ తెల్గుల జిల్గువెల్గవలె భావా! నవ్యవర్షోదయా!

ఈవేపాకుల పువ్వుపచ్చడులు హాయింగొల్పు వాసంతవే
ళా విష్కార పరీమళాల ఘుమ ఘుమల్ హ్లాదైక గానాల నే
నీ వేళన్ నినుగోర నా తెలుగు వారెల్లన్ సముద్వేగ దీ
క్షా వేశుల్ గద! యుద్ధరింపుము సమైక్య స్నిగ్ధ బాంధవ్యముల్.

భృతిజుల్ దగ్ధ హృదంతరుల్ హరిజనుల్ పేదల్ నిరుద్యోగులు
ద్ధృత దైన్యమ్మున స్రగ్గి మ్రగ్గుట విచారింపంగ దేశాన దు
స్థితికిన్ చిహ్నముగా గనంబడును సంక్షేమ ప్రజారాజ్య మీ
వితమున్ సాగిన నెట్లు? భావ యిట ప్రాప్తించున్ శుభోదర్కముల్.

ఈ కామాంధుల యంధ చేష్టలకు లేదేమో ? పులుష్టా పుగా
దీ! కన్నీటను నీ పరాభవపు వహ్నిజ్వాలలన్ క్రమ్గు శ్రీ
లోకంబెట్టు సముద్ధరింప బడగల్గున్ చట్టముల్ చుట్టలై
ప్రాకారాలుగ నిల్చుచో నిచట ధర్మంబెట్లు నర్తించెడిన్.

పలుకన్ సిగ్గగు నైన చెప్పవలె భావా! నాదు దేశాన నీ
కులముల్ సాధనముల్ సుమీ! బ్రతుకుకై కొండంత సంస్కారియున్
కులపున్ పంజరమందు చిక్కుకొనుచున్ గుంజీలు తీయన్ సము
జ్జ్వల సమ్యక్సమతా మహోదయ మహాభాస్వంతు డెట్లొప్పెడిన్.

కలుష భాషణము చిందులు ద్రొక్కగారాదు
మహిత శాసన సభా మందిరమున
మృత్యు ఘర్షణలు విజృంభింపగా రాదు
వార్తా మహామౌని వసుధయందు
కులమతాల పిశాచి తలయెత్తగారాదు
వేదాలు విహరించు పాదులోన
స్వార్థం పుటశ్వమ్ము స్వారిసేయగరాదు
అధికారి కుటిల మనోభ్ర వీథి

పరులకుపయోగపడని దౌర్భాగ్య రిక్త
వాగ్వివాదాలకును తెరపడిననాడు
నాడు తెలుగుల వాడలో నందనాలు
పరిమళించును భావ వత్సర! ధ్రువమ్ము.

ఈ పాటిన్ చెలరేగి మానవతకున్ హ్రీ కూర్చు దౌష్ట్యంపు టీ
ర్ష్యా పర్జన్య గభీర తాండవము గర్జా ఘోషలీ వేళని
ష్టా పూర్తిన్ ధ్వనియింపవో యపుడె స్వేచ్ఛా కౌముదీ సంహతి
శ్రీ పండున్ నవతా వసంతము గుబాళించున్ యుగాదీశ్వరా!

3)

34

ఈ వంచాంగ విధాత లీ భువనమందెన్నో యుగాల్ నుండి ప్ర
జ్ఞా పారీణులుగా భవిష్యమును ప్రస్తావించిరెవ్వైన నా
యీ పంచాంగములోని లక్షణములేవీ ! పండెనే ? సుధీ
వ్యాపారుల్ కొలువున్న దేశమున నుద్భాసించునే ? సంస్కృతుల్.

11-4-94

# సుబ్బరామిరెడ్డి

దాతగానార్ష ధర్మ ప్రోద్ధారకునిగ
రమణ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి
తెలుగు భూపలయాన కీర్తిధ్వజమ్ము
నిలుపలేనట్టి యొక్క యంగుళము లేదు

అనవరతమ్ము శివానందలహరిలో
మునిగి తేలిన భక్త మూర్ధ మణికి
అకలంక మహిత గాయత్రీ మహాదేవి
జపము గావించు సంస్కారమతికి
అనుపమాన వితీర్ణి గుణములో కర్ణుని
తలదన్ని నిల్చు వదాన్య హృదికి
అఖిల సాహిత్య విద్యా కళాభిజ్ఞుల
కుడుగరలిచ్చు మహోన్నతునకు

తిక్కవరపు వంశోద్ధార దీపమునకు
ప్రాజ్ఞ చరితుండు శ్రీ సుబ్బరామిరెడ్డి
పరమ దానశీలికి కళా బాంధవునకు
అమృత భావోదయునకు చిరాయురస్తు.

మీ దానాల పరీమళాలు విరజిమ్మెన్ తెల్గులోకాన మీ
యౌదార్యమ్ము ప్రశంసనీయమగు మీరా! శంభుపాదార్చనా
మోదుల్ మీరలొసంగగా దలచుచో ముష్టింపచుల్ గూడ రె
డ్డీ! దీనత్వములేని జీవనము హాయింజేతు రిద్ధారుణిన్.

కుంభాభిషేక మదంభవృత్తి నిజాటి
శివశంకరుని పూజ సేయునాడు
పరవశించిన భక్తి పరవళ్ళు ద్రొక్కగా
ధర్మ ప్రసంగాల దంచునాడు
నిరవద్య ప్రతిభామనీష లౌకవులను
పిలిచి సత్కారాలు సలుపునాడు
ఆశ్రయించినవారి యక్కరల్ దీర్పగా
ప్రియమెలిర్ప పసిండి విసరునాడు

పూర్వరెడ్డిరా జన్యుల భూరియశము
తిరిగి నిల్పెను మీవల్ల తెలుగునేల
ప్రణవ మంత్రజ్ఞ శ్రీ సుబ్బరామిరెడ్డి
విపుల కళలకు దొడ్డ వేలుపుల గిడ్డి.

17-9-94

# మల్లెమాల

ఈ సర్వాంధ్ర ధరాతలమ్ము మిము రెడ్డీ! మల్లెమాలా! ప్రశం
సా సాహోజయ గీతికా ధ్వనులతో సౌహార్ద భావాన నెం
తో సంతోషముతోడ గంతులిడు మీ తోరంపు వైదుష్య భా
షా సాహిత్యము డాక్టరేటు బిరుదున్ సాధించె ధన్యుండవో!

తెలుగున యమ్.యస్. రెడ్డీ
పలికిన మీ యాటవెలది పద్దియములు గుం
డెల నలరించు రసజ్ఞుల
కిలలో మీ కవనధాటి కివెగో ప్రణతుల్.

పెట్టితిరెప్డొ పూర్వమున పెట్టిన పెట్టుకు మల్లెమాలగా
పుట్టితిరిప్డు మల్లియల పోడుము లొల్లని వారలెవ్వరీ
మట్టిని రెడ్డిరాజుల సమాదరణీయము లెల్ల కావ్యపున్
ఘట్టములందు నిల్చెనివి గాథలుగావు చరిత్ర సత్యముల్.

ఇది తెలుగునాడు ప్రతిభకు నిచట నింత
తావులేదన్న సంగతి తమకుదెలియు
ప్రియ మెలిర్ప గౌరవ డాక్టరేటు పట్ట
మెప్పుడో మీకు రావలె నిది నిజమ్ము.

అటుప్రక్కన్ మదరాసు రాష్ట్రమున "యందన్నామలై" యూనివ
ర్సిటి మీప్రోన్నత దీప్రశస్త ప్రతిభారేఖా మహాసంప దా
ర్భటికిన్ మీ యమృతంపు సత్కవనపున్ ప్రాగ్భారధారా మహా
స్ఫుట సంసిద్ధికి డాక్టరేటు బిరుదంబున్ మీ కొసంగెన్‌జుడీ!

18-11-95

# మధునా పంతుల

మధురములగు శబ్దమ్ముల
పృధులములగు భావములను పే డెత్తిన నీ
ప్రథిత కలానకు సతతము
"మధునా పంతుల" కవీంద్ర మాన్యాంజలులో"

ఏరీ నీవలె తెల్గులో రచనలన్ హృద్యానవద్యమ్ముగా
స్వారస్యమ్ములు పండినట్లు రచియింపన్ శాస్త్రివర్యా ! కనన్
లేరంచున్ పలుకన్ యథార్థమిదిలే, నీదైన ఘంటాన జా
ల్వారున్ పొంగులువార సత్కవన ధారా నిర్ఝరీ ధోరణుల్.

5-8-95

## ఈ సంక్రాంతికి

ఈ సంక్రాంతులు పుట్టి నేటివఱకెన్నేండ్లయ్యెనో కాని, భూ
మీ సామ్రాజ్యపు శాంతి జీవనము స్తంభించెన్ మహామారణా
భ్యాస క్రీడలు పెచ్చరిల్లినవి యీర్ష్యా ద్వేషముల్ రేగె, నే
డీ సంక్రాంతికినైన మీకగు జగా హేరాళ సౌఖ్యోన్నతుల్.

14-1-96

## ఆకాంక్ష

ఆహము, దగా, ధనాశ, యివియన్నియు తెల్గుల జీవితానకున్
గ్రహణము లౌను చంద్రు గ్రహణంబొకనాడది మాసిపోవు నీ
గ్రహణములేండ్లు పూండ్లయిన గాని శమింపవు తెల్గుజాతికీ
గ్రహణము వీడుటెన్నడగు కాలమె నిర్ణయముంబొనర్చెడిన్.

ఔరా! తమ్ముడ! చెప్పుకొందము చరిత్రాంశమ్ములన్ తెల్గు వా
రౌరా! యే యుగమందు జాతిని సమైక్య స్నేహరాగాల రే
ఖారోచిస్సుల నించినారు తలపన్ కార్పణ్యముల్ బూనుటే
వీరత్వంబని యెంచు తెల్గులకు లేవేనాడు సౌభాగ్యముల్.

పరిపంథి యని వాని పరుష భాషణముల
వాడకు నీనోరు పాడుగాను
పార్టీలు మార్చిన వాడని వానిని
తిట్టకు నీనోరు మట్టిగాను
మునివేషమున మోసమును జేసెనని వాని
దెప్పకు నీ జిహ్వ తుప్పుగాను
వంచించి విత్త మార్జించినాడని వాని
వదరకు నీనోరు భ్రష్టుగాను

చేతనైన నవ్య చైతన్య విస్ఫూర్తి
పథములోన నడువ వలయు ప్రజల
స్వార్థ రహితమౌ భవజ్జీవనము మహా
ధన్యమై పొనర్చు పుణ్యమౌచు.

కులము ధనము నీకు గలదని భావించి
రెచ్చిపోయి వట్టి పిచ్చిపనులు
వలదు సేయ ప్రజలు పరికించుచున్నారు
కితవ వేషములకు ధృతి యడంగు.

ప్రతి పక్షీయులె గూఢచారులయి నీవైనమ్ముగనెప్పట్టి ని
న్నతి హీనమ్మగు ముద్రవేసినను లెక్కా నీకు సంపాదనం
బతి ముఖ్యంబు ప్రభుత్వమున్నడుపువాడా! నేటికైనన్ ప్రజా
హితమై స్వార్థపు చింతవీడి మనవోయీ! రాష్ట్ర సంశ్రేయమై.

చిఱు నిరుద్యోగుల జీవితాకాశాన
దళుకొత్త చంద్రుండు వెలుగునాడు
అన్నదాతల రైతు లాక్రందనలకు స
త్వర పరిష్కారమ్ము జరుగునాడు
స్వార్థబుద్ధిని వీడి పదవు లాశింపక
ప్రజలకోసము పాటు పడిననాడు
కులమతాల పిశాచముల వంకజూడక
మానవీయత గుండె మసలునాడు

రాష్ట్రమందెగాక ప్రతిరాష్ట్రముల యందు
దండిగా శుభాలు పండు నాడు
డాబులేని చంద్రబాబు పాలనలోన.
తెలుగుజాతి పొందగలదు సుఖము.

మా వల్లన్ కలిగెన్ తెలుంగులకు నీమాత్రమ్ము సౌఖ్యాలుగా
దా! వేరెవ్వరివల్ల కల్గునని నీవావేశముం జూపి ద
బ్బా వాయింపకు ముందు తెల్గులకు సౌభ్రాతమ్ము నేర్పించు నా
డే వెల్గున్ వెలుగుల్ తెలుంగులకు భాయీ! నాయకోత్తంసమా!

దేశ సంస్కృతిని దిగ్దేశాల ప్రకటించు
కళలకాశ్రయమియ్య గలుగునాడు
తిన్నాడా లేక వస్తున్నాడా యని మహా
కవులగూర్చి తలంపు కలుగునాడు
పరమ నిర్భాగ్యుల వదనాబ్జములయందు
చిఱునవ్వుల సుమాలు విరియునాడు
ప్రజల సేవనమె నా లక్ష్యంబనెడువాడు
బ్రతుకులో పదవిని వదలునాడు

తెలుగు తేజమెలమి దిగ్దిగంతాలకు
చెన్నుమీర నలముకొన్ననాడు
నాడు తెలుగునేల నవనవౌజ్జ్వల్యంపు
గొనబుకీర్తి నందు కువలయాన

# కృతజ్ఞతాంజలి

"ఈనా డెబ్బదియైదు వత్సరములో నీవేళనీలాగు వి
ద్యానిష్ణాతుల సాహితీప్రియుల యౌదార్యము కల్పించు స
న్మానంబుత్సహనంబు నాకొసగు నానందాన నింకెన్నొ క్రా
వ్యానూన ప్రసవాల్ సృజించెద రసజ్ఞశ్రేష్ఠులగ్గింపగన్"

"భేదములేని మానవత ప్రేమకు చిహ్నముగాగ వెల్గగా
పాదులు నిల్పుకొన్న ప్రతిభాచవికేంద్రము" విశ్వసాహితీ
వేదిక సంతరించుకొనె విశ్వయశస్సును పోతుకూచి వి
ద్యోదయ గాఢదీక్షకిది యుజ్జ్వలచిత్రముగా రచించెడిన్"

ఈ సాహిత్య కళాతపోవనములో నీయర్వదై దేండ్లు భా
షా సేవన్ బొనరించి మేల్ రచలన్ సాగించియాంధ్రాళి కె
న్నో సత్కావ్యములంద జేసితిని ధన్యుండన్ యథార్థమ్ము నే
నా! సాహిత్య కళాప్రపూర్ణ దవునయ్యా! నేకవిగ్రామణిన్"

"నీ యధ్యక్షత సాగుచున్న సభ నిండింపించు సద్గౌర వ
శ్రీయౌన్నత్యము నీ రసార్ద్రి కవనశ్రీ నిర్ఝరీదార ల
న్నా! యాంధ్రక్షితి సాంబశివరాయా! పారె సాహిత్య దీ
క్షా యజ్ఞమ్మును సాగనిమ్మిదియె శశ్వత్కీర్తి గల్గించెడిన్"

"విడియములేని చిత్తమున పేదలపెన్నిధి వౌచునిల్చి యీ
బడుగులనీ బహిష్కృతుల బంధువునౌచు సముద్ధరింపగా
నడుమునుగట్టినట్టి సుగుణాఢ్యుడు మానసమున్న మంత్రి శ్రీ
కడియము శ్రీహరిన్ వలచుగాక! శుభావహమైన సౌఖ్యముల్

మీ హయాములోన ఈ హరిజనజాతి
మొగములందున చిఱునగవు లెలమి
సొగవలయు సతము సాంఘిక సంక్షేమ
మంత్రి శ్రీహరీ! నమస్సులివెగొ!

"క్షితికిన్ నిర్మల ధర్మమార్గమును విశ్లేషించి బోధించు సం
స్కృతికిన్ దీపిక హైందవమ్మది జగచ్ఛ్రేయమ్ము చేకూర్చుచే
హితమౌ నాకనిచాటు సన్మతికి వేయేండ్లౌను సుబ్రహ్మణ్య ధీ
మతికిన్ జీ.వి.కి జీనియస్సునకు ధర్మక్షమాశాలికిన్"

"ప్రతిభావంతుడు యోచనాపరుడు విద్వన్మూర్తి దీన ప్రజా
హితుడు స్నేహ కళారసజ్ఞుడు దయాదృక్శీలుడు ధ్యన్మహా
మతి శ్రీ పున్నయ న్యాయమార్గమును సంభావించి పేర్గాంచె ను
న్నతభావాలు గలట్టి వానికగు నౌన్నత్యంపు సత్కారముల్"

గొప్ప కవయిత్రి రచయిత్రి గొప్పవక్త
గొప్పలను చెప్పుకోలేని గొప్పమహిళ
సమతలోకాన నాశించు నమృత హృదయ
అట్టి వాసా ప్రభావతి కగు శుభాలు"

"కవివై పాండితికల్గువాడవయి ప్రఖ్యాతాంధ్ర విద్యాధినే
తవునై నిమ్నజులాత్మ బంధువుగ సత్యంబున్ సమర్థించు మా
నవతామూర్తిగ భారతీయత జగానన్నిండనాశించు శ్రీ
టి.వి నారాయణ మీ యుదారతలు సృష్టించెన్ కళాగౌరవాల్"

"రిస్కునుగూర్చు నట్టిదగు వృత్తిని గైకొని యీ సబర్మతీ
మస్కరి బాపూజీ యమల మార్గములో పయనించు సీమలో
తస్కరులుండరా దనుచు దౌష్ట్యములేలగరాదటంచు యం
భాస్కర! దేశరక్షణకు భారము మోయగ నెంచినాడవో"

మల్లెల బాబూ రాయున
కుల్లంబున సంతసాన నొనరగనిత్తున్
మల్లెల పూవుల నతులను
కల్లోలపు లోకమునకు కన్నులు గుట్టన్

"విలసన్మంజుల భావనా పటిమలో విస్ఫూర్తి గుర్తించి స
త్కళలన్ మెచ్చెడు పాత్రికేయులకు హృద్యంబైన సాహిత్యపున్
పలుకుల్ గైతలయందచందముల సంభాళించు ప్రజ్ఞాప్రపూ
ర్ణులకున్ మాన్యులకున్ కృతజ్ఞతలు సంతోషమ్ము మీరాకకున్"

"ఈ నేటి సభకు కారణ
మైనిల్పి విశేషభారతీమంతయు తనపై
తానేయిడుకొని మోసిన
నానందన జ్యోత్స్నకగుత నాయాశీస్సుల్"

16.7.96.

# రసమయి

"రసమయి సాహితీ విజయరాజ్ఞి మనోజ్ఞ కళాజగత్తులో
అసదృశకీర్తి శోభలు దిశాంచలముల్ ప్రసరించుగాక స
ద్రసికుల మానసాబ్జముల దండిగహర్షము నింపుగాక! యీ
పసదనపున్ బహూకృతిశుభస్థితి గూర్చుత నాకు భావిలో"

ఉపనిషన్మాధురీ ప్రపసుధాధారలో
తానమాడిన జగాధార్మికుండు
శ్రీశైలముననివసించిన భ్రమరాంబ
మల్లికార్జునులపై మనసునిలిపి
తనజీవితాన పేదల నిండుగుండెలో
నమృతమ్మునిడిన దయార్ద్రమూర్తి
వార్ధామహామౌని పథములో నడచిన
పరమశాంత క్షమాభావుకుండు

"ఘనుడు శ్రీ పైడిలక్ష్మయ్యగారి పేర
నీ యెవార్డు నాకిడుట యదృష్టమొకటి
కూర్మి నీ సభాధిపతిగా కూరుచున్న
రెడ్డిరాట్కృవివలన యదృష్టమొకటి"

కవులన్నన్ గవితా ప్రసంగములనన్ కమ్మందనంబైనమేల్
చవులూరించెడు వాక్కులన్నను ముదస్వాంతమ్మునన్ వించు మా
నవ జాతీయతగోరు మీ మనుగడల్ నవ్యప్రధామార్గమై
నవనీయంబగు విశ్వలోక కవిమాన్యా! బుచ్చిమాంబా సుతా!

47

"జనముల్ మెచ్చగ తండ్రిపేరున కళాసాహిత్యలోకాన త
ద్ఘనతన్ జాటగ దొడ్డభావమున సత్కారాలు గావించు స
జ్జన మాన్యోదయునిన్ రసజ్ఞుని ప్రజాసంబంధి "సంజీవరె
డ్డిని" యీలాగున కాలమేసతమునడిపించున్ కళాక్ష్మాస్థలిన్"

రసికవరులు మెచ్చ "రసమయి" సృష్టించి
చేతమలర కవుల కూతమిచ్చు
"రాములెమ్కొ" హైదరాబాదు నగరాన
ప్రబలుగాక! సత్కళాధరిత్రి!"

23–5–97

# బహుధాన్య!

బడుగుల్ దీనులు ప్రత్తిరైతుల కుటుంబాల్ వందలన్మించుచున్
మడియన్ వేతొకప్రక్క కాటకము లెండంగట్టి యాంధ్రావనిన్
వడకింపన్ దురదృష్టమైన తరుణానన్ నీవుమానేలలో
అడుగున్ మోపితి వేమిసేతు బహుధాన్యా! ధన్యవాదంబులౌ.

సమధికోత్సుకతతో స్వాతంత్ర్యదేశమున్
పాలించె ఖదరువస్త్రాళిహితుడు
ముబ్బడి సదుపాయములు సేతుననుచ ప్ర
గల్భించె పచ్చచొక్కాలనేత
సకలసౌఖ్యాలను సమకూర్తుననుచు ప
ల్కెను నిబ్బరాన సంకీర్ణవిభుత
భారతీయత నిల్వబడుననె కలగూర
గంప మతుల సమైక్యాధినేత

"వారితలదన్ని కాషాయవస్త్రధారి
ప్రథిత రాజ్యచక్రముచేత పట్టెనిప్పు
డహరహమ్ములు జాతిభాగ్యమ్ముకొఱకు
పాటుపడవలె బహుధాన్య వత్సరమ్మ!"

నిరుడు స్వతంత్రభారతికి నిండినయేబది యేండ్లపండుగన్
జరిపిన భారతీయులకు క్షామము చావులు తప్పచెప్పగా
నొరిగినదేమిటో తెలియదో! బహుధాన్య! సమున్నతాశయా
చరణులు రాజ్యమేలిన ప్రజల్ సుఖశాంతులు పొందకుందురే?.

"వ్రాయగ రెండు వేల యిదువందలయేండ్లకు పూర్వమే ప్రజా
శ్రేయముగోరి చూపులకు సిద్ధుడు పాలన రీతిగూర్చి 'ప్లే
టో' యెలుగెత్తిచాటె టకటొంకు లనర్థులు రాజ్యమేలగన్
శ్రేయముగూడు సత్కవి ఋషీంద్రుడు రాజ్యము నేలగల్గుచో".

ఇది మత్సరగ్రస్థ పృథివి లేదొకియింత
స్నిగ్ధతారాగాల చెలిమిపొత్తు
ఇది విషకుల భూతకదనభూమి యొకింత
ప్రసరింపదిట మానవత్వ దీప్తి
ఇది నైచ్యదుష్ట సంస్కృతికి బడానేల
పదము మోపదు శాంతిపావురమ్ము
ఇదివర్గబీభత్స సదనమ్ము విహరింప
దవగాహనపు మహదాశయమ్ము.

"ఎవడు వేసె నిటుక నిటతొల్త నానాటి
నుండి నేటివఱకు నిండియాకు
నిటుకలెల్ల గలిసెనేమొ? ఓ, బహుధాన్య
అమరలేదు జాతులందు సమత"

కవులను గారవించు నధికారులు రాజ్యము సేయువేళనా
కవులకు గొప్ప సత్కృతులు కల్గును గాని బడాజగాదగా
వివశులు రాజ్యమేలిన లభించునె బాదరబందిలేని సౌ
ఖ్య విభవముల్ ప్రజావళికి యందునొకో! బహుధాన్య వత్సరా!.

అరయంగా గణతంత్రరాజ్య మిదియేనా? రాజకీయాల గం
దరగోళమ్ము లటన్న వంచనముగాదా! విజ్ఞులైనట్టి వో
టరు లీమర్మ మెఱుంగలేరె? పనిపాటల్లేని గూండాలకున్
కరమందించిన నవ్యభారత శతాంగంబేమి కానున్నదో.

ఇష్టము లేకపోయినను హీనులుగా తెగముద్రవడ్డ యీ
భ్రష్టకులాల మానవులపై మఱి యెందులకింతగాఢమౌ
దృష్టి యదొక్కనాటకములే, బహుధాన్య! వచింపలేదులే,
ముష్టికులాలబ్రహ్మ, మనవున్ని రసించెద బ్రహ్మబంధువున్.

"ఉప్పొంగదే పోతులూరి వీరబ్రహ్మ
తన వాక్కు ఫలియించుటను గుఱించి
హర్షమందదె వివేకానందముని తన
పల్కులు సిద్ధింప బడుటగూర్చి
పులకింపదే కందెబొట్టు వార్ధాయోగి
తనకోర్కె సిద్ధించుటనుగుఱించి
ఆనందపాథోధిలో నీదదే బాబ
సాహేబు తన జాతి జాగృతికయి"

"వేల వర్షాల నావల విసరవేయ
బడిన దళితుల కీనాడు ప్రముఖ పదవు
లియ్యబడుట కాలమహిమయే? నిజమ్మె
ఓయి! బహుధాన్య వేరెలేదోయి యిందు"

బ్రతుకుతెరువులేక పస్తున్న పేదల, ఆకలిజ్వాల చల్లారునాడు
దేశప్రగతికి నిర్దేశకులైనట్టి, యువతలోనుత్సాహ మొలుకునాడు
పార్టీలమార్చెడు వంచకశ్రేణిని ఛీకొట్టుచున్ బుద్ధిసెప్పునాడు
మత రాజకీయాల మాలిన్యముల్లేని, పరిపాలనము సేయబడినాడు

"అణగద్రొక్కబడిన యాతడభ్యుదయంపు
తెన్నులోన నడచు కొన్ననాడు
బహువిధాలకలుగు బహుధాన్య సౌఖ్యాలు
దేశమునకు నాంధ్రదేశమునకు"

## ఈశ్వరా!

ఇది గౌతముడు జనియించిన నేలరా!
అయిన హింసోన్మాద మడగలేదు
ఇది జిన ఋషి మౌళి పొదలిన భూమిరా!
అయిన కామక్రోధ మారలేదు
ఇది నరేంద్రుడు చరియించిన సీమరా!
అయిన ధర్మక్రాంతి యలరలేదు
ఇది బాపుజీ జన్మమెత్తిన వసుధరా!
అయిన సత్యశాంతి యమరలేదు.

"గొంతు చించుకొంచు గొప్పలు సెప్పుచు
దప్పు కొట్టుకొను బడాయి జాతి
కీసులెచ్చు సాహితీ సౌరభములెట్టు
లీశ్వరా! రహించి యేపు మీరు!"

"ఇడుముల స్వాకములో నిరికి యీ ఋషి భూమిని స్వప్రతిష్ఠపున్
జడనిధి ముంచినట్టి కుహనా పరిపాలకులన్ క్షమించు చో
పుడమిని గౌరవార్హతలు బుగ్గగు రేపటి జాతి కెట్టుల
బ్బెడిని నిసర్గ గౌరవపు పీఠము విశ్వమువందు నీశ్వరా!"

"వెడలెను దాత! మా తెలుగు వీథుల కొంపలు ముంచి పచ్చగా
నడరెడు సస్యరాశులను నాస్తులు పాస్తులు నేల గర్భమం
దడగెను పెన్ తుఫాన్ గడు భయంకర జృంభణ వల్లనెట్లు మా
పడిన మహాపదల్ తొలగు మైనము దెల్పి సముద్ధరింపుమీ!"

"ప్రజల గుఱించి శాసన సభన్ పలు చర్చలు సాగు వేళలో
ధ్వజముల నెత్తుకొన్న యిరుపక్షము వారల కీసులాటలో
గజిబిజిలోన నుద్ధరణ కల్గునె? జాతికి నచ్చమైన యే
యిజములు లేని యేకతల నీవయినన్ నెలకొల్పు మీశ్వరా!"

"కూర్చరా! జాతికి కుంభిని కొండాడ
ప్రియమార స్నేహ పరీమళమ్ము
మార్చరా! దేశ సంపద తేరగా మెక్కు
నాయకావళి వంచనావిధమ్ము
పేర్చరా! విశ్వాస పేర్గన్న నవ్యభా
రత సుయశ శ్శిఖరాల దొంతి
నేర్చరా! ముని ధారుణీ ఖండమునకును
సంస్కార సంస్కృతి సహన విద్య

"బెదరి చెదరి పోయి వేల వర్ణాలుగా
చీలి దేశగతుల చీల్చుచున్న
ఈ కులాల నెల్ల నేకమ్ము సేయరా!
అదియె హైందవమున కంతరాత్మ!"

"కలిమికులమ్ముతో కనుల కావరమెత్తిన మత్తులో దరి
ద్రుల వెలివేసి యూరికి సుదూరముగా నివసింప జేసి వా
రల శ్రమవల్ల సౌఖ్యముల రాశుల దోగెడు సాములెల్లరి
దళితులకున్ ఋణస్థులు గదా! గ్రహియింపరు వారలీశ్వరా!"

"ఆగునా? వాదాల యందున జిక్కుకొ
న్నట్టి రాష్ట్రం పుట్టాల్మట్టిబెడద
సాగునా? రాష్ట్ర ప్రజావసరాలకు
చాలినంతగ ఖజానాల పుష్టి,

పీగునాః భయప్రకంపితులుగా నొనరించు
రక్తసిక్తంపు మారణ చరిత్ర
దాగునాః పాతాళ ధారుణీకుహరాన
కులమతోన్మాద శక్తుల గణమ్ము

"దళిత జనుల వేదనలు చట్ట సభలలో
గెలుచునాః యుగాల కలత మాపి
ధార్మికోర్వి లోన తల యెత్తునేః మాన
వీయ గుణము లీశ్వరా! యుగాది".

"ఏలినవాని దొడ్డ గుణమే! జన జాగృతికిన్ ప్రతీకయౌ
ఏలిక స్వార్థనిర్ఘరిని నీతలు గొట్టిన నాశమౌను త
త్పాలిత సీమలెల్ల నిక పాఠము లెందుకుః తెల్గు వారిక
ల్లోల హృదంతరాళములలో వెలయింపుము శాంతి చంద్రికల్.

"దళితుల్ సేద్యము సేయమాను నెడ క్షేత్రాలెట్లు సస్యాలతో
విలసిల్లున్ పనిపాట మానిన యెటుల్ విశ్వమ్ము జీవించు వా
రలె నిర్మాతలు భావి దేశ గృహ నిర్మాణానికిన్, వారె రా
జులు ముమ్మాటికి కాలమే కడకు తీర్పున్ యోగ్యతా యోగ్యతల్".

## ధర్మాగ్రహము

దౌర్జన్యమున ప్రజాధనము మెక్కిన ద్రోహి
కుడుగర యురిశిక్ష పడిననాడు
అవినీతి పనుల కాహ్వానించు నధికారి
నర్హమౌ చెఱసాల కంపునాడు
మధువును మగువను మరగిన లుచ్ఛాకు
కొరడాలతో బుద్ధి గరపునాడు
స్కాము, హవాల, డీజలు, గడ్డి గూర్కొన్న
చెడుగులాస్తులు జప్తుసేయునాడు

అప్పుడే స్వర్ణభారతి కయిదుపదుల
హాయనాల పర్వాల మహాదినాలు
నాడుగాక! నేడేమిరా! నలుగుచున్న
ఉమ్మలించిన క్షితికి స్వర్ణోత్సవాలు.

సిగ్గువ్విడి జనాళి విత్తమును భోంచేశావు నీ యబ్బదా?
సిగ్గువ్విడి నికృష్ట నీతులను దంచేశావు మేధావిగా
సిగ్గువ్విడి మునిప్రపంచమును ముంచేశావు దారిద్ర్య మం
దిగ్గాథల్ నిను నూరకే విడువవోయీ! స్కాము చోరాగ్రణీ!

నాకన్నన్ మొనగాడు దేశమున నీనాడెవ్వడున్నాడు నా
దీకిన్ మించిన వాడెవండిచట దిగ్దేశాలు కొండాడె న
న్నీ, కాలాన గలట్టి నాయకులలో నెవ్వండు నాకుజ్జి యం
చా కాంక్షించిన నీతలంపు లెటు శూన్యంబయ్యె యోజింపుమీ!

ఈకుల ప్రజాస్వామ్య మహితలమ్మ .
దిన్నివే లేండ్లకొక బహిష్కృతుని నిలిపి
రాష్ట్రపతిగా నొనర్చి గౌరవము పొందె
మెఱసె సమతయు గుడ్డిలో మెల్లగాగ!

ఈ కల్లోలాలకు పెను
భూకబ్జాగాండ్రు లంచములు మేసిన కుం
డా కోరులు గూండా లౌ
రా! కారణము తొలినఱచరా! అవ్వారిన్!

ఈ పార్టీలు మతాల వర్ణములయందే చిత్తమున్నిల్పి హ
త్యా పారీణత సూపి దేశమును సద్యోన్న స్థితిన్ ముంచి దీ
ర్ఘోపన్యాసములిచ్చు పెచ్చు ప్రజలో హో! యంచు చప్పట్లుతో
దీపారాధన చేయుచో నెటుల సే దేశమ్ము బాగొందెడిన్.

హృద్యమైన సారస్వత పద్యమొకటి
నాయకోద్రేశ్వరుల దుకాణాలయందు
అఱచి యలసిపోయిన సరే! దొరకదిచట
మస్తుగా దొరకు నిచట మద్యమొకటె!

రాజకీయ బేరాలలో రంగుమార్చి
నీతిదప్పి గూండాగిరి నెఱపువాడ
తిరుగబడు వారి ప్రాణాలు తీయువాడ
భాగ్యహీనులకై పాటువడవు గాని
వలపు లూరించు మగువ కావలయు నీకు.

అంగుళమైన నేలకలదా? నవభారత భూమిలోన నె
న్నంగ విశుద్ధ వర్తనమునన్ నడయాడుట కింతయేని రా
జ్యాంగపు శాసనాల తమ హస్తములందున నుంచుకొన్న వా
రింగన చెప్పకే చెపును దేశము స్కాములలోన మున్గెడిన్.

గుడిసెలు పేరుసెప్పి తమకున్నెల వైన స్థలాల నమ్మి ము
ఖ్యదిగ ధనమ్ము గుంజుకొను పాలకులేలిక లైనచో నెటుల్
సచచును హైందవ క్షితి విలాసములోన మునుంగు నాయకుల్
వలన లభించునా? ప్రగతి భాగము రోగముగాక చెప్పగన్.

ఏరీ నీతికి కట్టుపడ్డ గుణులేరీ? బాపుజీ ధర్మపున్
దారిన్ ద్రొక్కెడువారు నాయకులె గూండాలైనచో దేశపున్
దారిద్ర్యమ్మెటు లంతరించు నిదియేనా? సుప్రజాస్వామ్యపున్
తీరుల్ తెన్నులు దుష్టపద్ధతుల చెండింపించుటే న్యాయమా.

ఈ రౌడీయిజమంతరింపనిదె రాదేలా బీ సంస్కార సు
శ్రీరమ్యత్వ శుభోదయమ్ములు ప్రజాశ్రేయస్సు గాంక్షించు వా
రేరీ! గద్దిని దిన్నగాడిదలకేదీ? శిక్ష యవ్వారికిన్
కారాగారముగాదు వారలురి శిక్షార్హుల్ సమీక్షింపగన్.

ఆదిమ కాలమందున దిగంబరుడై చరియించు మానవుం
డీ దివసాన నభ్యుదయ దృక్పథమందు చరించుచున్నగా
నీ: దిగజార్చు ఘోరమగు నీచపు హత్యల కుట్రదారుడై
మేదిని సంచరించుట క్షమింప రానిది దుస్సహంబగున్!

స్రుక్కుచనున్న సంపదల క్షోణికి నిప్పటికే ప్రపంచ మం
దెక్కడలేని యప్పులున్నయవి యయ్యవి లెక్కకురావుగాని యీ
బొక్కస మారిపోయినను మోరక పాలకు లెల్లతేరగా
బొక్కుదురీ ప్రబోధనము బుద్ధుడశోకుడు గాంధిసాక్షిగా.

కలిగినవారి యాస్తులకు గట్టిగ నేతురు బందు బస్తులీ
వలిగినవారి యిండ్లబడి నాట్యము సేయుచు మానభంగముల్
వలుపుదురేమి యన్న చెఱసాలను ద్రోచెద రంతులేని యీ
దళితులకేది మోక్షమొక దారియు తెన్నునులేని వీరికిన్.

# స్వర్ణోత్సవ వేళలో

కనిపింపరాదిట తినతిండి లేనట్టి
నిఱుపేదవాని కన్నీటిబొట్టు
వినిపింపరాదిట విశ్వమ్ము గర్హించు
కుటిల చిత్తుని దగాకోరు పలుకు
ధ్వనియింపరాదిట స్వార్థమాశించిన
స్తోత్ర పాఠకుని యపాత్రగీతి
తనియింపరాదిట ధర్మమ్ము నెదిరించు
కపట భక్తుని క్షుదా గర్భితలము

కదలుచున్న ప్రగతి కల్యాణ దేవత
నవ్య భారతమున నాట్యమాడి
జరుగునేబదేండ్ల స్వర్ణోత్సవాలకు
నుజ్జ్వలింపు టూత మొసగుగాక!

8.8.97

# వివేకానంద సింహగర్జన

"శిథిలమగుచున్న జాతి సంస్కృతిని దలచి
నిండు నిర్వేదమున కంటనీరుగార్చి
ఎన్నికష్టాలు పడితివోయీ! యతీంద్ర!
ఎంత కారుణ్యమూర్తివోయీ! నరేంద్ర!"

"రామకృష్ణుని సుధారమ్య వాగ్ఝరిలోన
తనివార సతము గాహనము సేసి
దిగజారిపోయిన దేశ సంస్కృతిని స
ముద్ధరింపగ నొగి నుద్యమించి
సర్వదేశ మతాల సభలోన హైందవ
జాతి వైశిష్ట్యంపు జాడదెలిపి
యుష్మదౌజ్జ్వల్య నవోన్మేష సందేశ
ములను పాశ్చాత్య భూములకుపంచి

"విశ్వ విజ్ఞాన వేదాంత వీథులందు
అమలినంబైన ధర్మ శతాంగమెక్కి
జగతిలో మానవత్వమ్ము చాటినట్టి
క్రాంతి దర్శివిగా నరేంద్రా! జోహారు"

"దిగ్దేశాల మతాల యోలగములో దేశ ప్రతిష్ఠన్నిల్పి నీ
వాగ్ధాటీ మకరంద బిందువుల శుంభద్వార్ధిలో ముంచి వై
దగ్ధిన్ సభ్యుల నిండు గుండియల సంస్థాపింప సు
స్నిగ్ధశ్రీల పరీమళమ్ములు రహించెన్ నీ ప్రసంగాలకున్".

"వచ్చిన సర్వదేశ మత పండిత మండలి యత్రమంద గం
గాచ్ఛ సమాన ధీమధుర వాక్కుల వారలు తేలియాడగా
ఋచ్చిన నీమహోన్నత ప్రభూత మహోజ్జ్వల భావరాజ సం
పచ్ఛయముల్ దిగంతముల ప్రాకె నరేంద్ర యతీంద్ర చంద్రమా".

ప్రముఖముగా నయగరాజలపాతము మించిపోవు వే
గము గలయట్టి నీ మదురక్రమ మహా విలసత్సుధా ప్రసం
గములకు నెల్ల తెల్లదొరగారలునున్ దొరసానులున్ మన
స్థిమితము నెంది యైదుపది నేసిరి నీకు యతీంద్ర సత్తమా!

ధీర తపస్వి! తేనియల తీయదనంబును క్రిందు సేసి గం
భీర వచః ప్రసంగముల విశ్వము వీనుల విందుగా సువి
స్తారముగా వచించితివి తావక ధాటికి కొయ్యబొమ్మలై
నారు, సదస్సునం గల జనమ్ములు హైందవజాతి రత్నమా!

తనువెల్ల పులకరించినది చికాగో న
గరము నీయమృత వాగ్ధాటి కెలమి
బచ్చెన బొమ్మయ్యె వసుధ సర్వమతాల
మనికి విద్వత్సభా మందిరమ్ము
ధిషణుల పాశ్చాత్య దేశమ్ము నీదు వే
దాంత ధోరణికి విభ్రాంతి పడియె
తోరమౌ నీ సదాచారమ్ముగని నీకు
జేజేల నర్పించి శిష్యులైరి

గుండెనిండ ఋజుత నిండి పోయినవాడ
వెలయు ధర్మ దృష్టి గలుగువాడ
శాంతి భరత భువన జాతీయ సద్యశో
ఢక్కగొట్టినట్టి యెక్కటీడ!

గురుదేవుండగు వాని దీవనల వాక్కుల్ నిన్ను వెన్నాడ సు
స్థిరమై పొల్చిన నీదు భక్తికిని మాతృశ్రీ మహాశీస్సులన్
గురిపింపన్ నవతా మహోత్సుకతతో క్షోణిన్ ప్రచారించితో
అరుదారమ్మిది సాధుపుంగవ! వివేకానంద! వాక్రువ్వగన్.

మతమునకున్ మహార్థమగు మర్మములన్ వివరించి క్లిష్టపున్
గతుకుల నెట్టుచున్ గురుని గాటపు కూర్మికి నోచు కొంచు నీ
కుతులతలాన సత్యమునకున్ గల శక్తిని గుర్తుచేసి భా
రత జనయిత్రి సంస్కృతి విరాజిల జేసిన పుణ్యమూర్తివో!

నీ కున్ముందుగ నెందఱోయతులు కన్నీర్నించి యీ దేశ సు
శ్రీకిన్ సంస్కృతికిన్ కృషిం బొనర్చిరి తపస్వీ! నీవు పాశ్చాత్యమే
ధా కంధుల్ బహు విస్మయంపడ వినూత్నంబైన వేదార్థమున్
సాకల్యాన వచించినావు తనువుల్ స్తంభింప యోగీశ్వరా!

పరమ నాగరకతా పాశ్చాత్యదేశాల
చాటితి వుపనిషత్సార మహిమ
అతి సనాతనపు భారతమును నిలబెట్టి
దట్టించితివి కీర్తి కుట్టిమమ్ము
నగుబాటు దెచ్చు ఛాందన మతస్థుల కల్ప
నల నెదిర్చి నవార్థములను దెలిపి
ఒకపూట యింత గంజికి నోచుకొనని ద
రిద్ర మూర్తుల నుద్ధరింప దలచి

గుండెలో నగ్ని శిఖరి రగుల్కొనంగ
విశ్వ దిగ్జాలములు నిన్ను వినుతి సేయ
గొప్ప యుత్తమదేశ భక్తుడవు నీవు
హిందు ధరణి నీకొఱ్కె రహించుగాక!

తినుటకు తిండిలేక కడుదీనత జీవిక నల్పుచున్న నా
జనముల నుద్ధరించి యగచాట్లను పూర్తిగ పారద్రోల నీ
క్షణమున నుండి కంకణము గట్టి యుదారత చూపలెందు మి
మ్ము నడుగదోసమా? భువనమున్ గుఱుతించిన మీరెఱుంగరే?

నా హిందూ ధరణీ తలాన మతమున్ స్థాపింప మీరింతయు
త్సాహంబున్ వెలయించు చుండుటలు పాశ్చాత్యుల్ మతంబన్న జీ
వా హారమ్ముగ నెంతురీ తలపులత్యంత ప్రమోదాలు మా
కో హో! మాకును గల్గు నీ మతము మీకోగ్రాహ్యమౌ గావుతన్.

వలసినంత మతము భరత భూభాగాన
కలదు మాకు గాని వలసినంత
బ్రతుకుతెరువు లేదు మతము వద్దు క్షుధాగ్ని
పీడితులకు బువ్వ పెట్టవలయు.

కఱవుల్ వెన్వరదల్ భయంకరపు భూకంపాలు రోగాలు దు
ర్భరమౌ యాకటి మంటలీ భరత విశ్వంబున్ గలంచన్ సహో
దురులౌ యీరలు కూర్మి పేర్మల మహౌదార్యమ్ము బాటించుడో
దొరలారా! దొరసానులార! యిది యుద్ఘోషించు మీ ధర్మమున్.

30-6-98



కళాప్రపూర్ణ డాక్టరు ఎస్.టి. జ్ఞానానందకవి, డి.లిట్